శ్రీ యై నమః

# వీర పురుషులు

## గ్రీసుదేశ వీరులకథలు

## ప్రథమభాగము

గ్రంథకర్త.

సహస్రావధాన ఫణీంద్ర, సహస్రావధాన వాచస్పతి,
సహస్రావధాన చతురానన, సహస్రావధాన
పంచాననాద్యనేకబిరుదాంకిత
పంచ సహస్రావధాని

జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి



ప్రకాశకులు:

కొండా శంకరయ్య
పుస్తకవ్యాపారులు,
సికింద్రాబాద్, హైద్రాబాద్ & వరంగల్.

1954

 [వెల ఐ. జి. 1—0—0

# విషయసూచిక.

## థీసియసు



## పర్సియసు

# హెచ్చరిక

ఈ పుస్తకముయొక్క సర్వాధికారములు మాకే చెందియున్నవి, కావున మా అనుమతి లేనిది దీని నితరులు ముద్రింపగూడదు. అట్లు ముద్రించినచో మాచే నొనర్పబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగా హెచ్చరించనైనది.

ఇట్లు

కొండా శంకరయ్య

పుస్తకముల వ్యాపారము

సికింద్రాబాద్.

# వీర పురుషులు

## థీసియసు

## ప్రథమ భాగము

## థీసియసు అసామాన్యమైన ఆక్షేపలకు నెత్తుట



పూర్వకాలమున గ్రీసుదేశ భాగమయిన ట్రోజీన్ నగరమును పిథియస్ రాజు జనసమ్మతముగఁ బరిపాలించుచుండెను. అతనికుమార్తెయగు ఐత్రాకు థీసియస్ అను కుమారుడుండెను. అత డాయా ప్రదేశములయందుండు రాజకుమారుల లోనికెల్ల నుత్తమ ధైర్యశాలియని పేరు వడసెను. ఐత్రారాణి మనోవిభు డామె నింటియొద్ద విడిచి దూరదేశమున కేగి, కార్యాంతర నిమగ్నుడై భార్యసంగతియేమఱచెను. అందువలన నారాణి తనకుమారుని జూచినప్పుడు విచారపడుచుండెనుగాని, యొకప్పుడును మందహాసము సేయుచుండుట లేదు. ఆమె ట్రోజీన్ నగరముననున్న గుట్టపై నిర్మించబడియున్న పోసీడన్ దేవాలయమునకుబోయి తదంగణమున గూరుచుండి, యచ్చటికి మెథీనాఖాతముమీదుగా నగపడు. ఏజీనా పర్వతశిఖరములవంకను, ఆటిక్ సముద్రతీరము వంకను జూచుచుండెడిది. థీసీస్‌కు పదిహేను సంవత్సరములప్రాయము.

వచ్చినప్పు డతనినిగూడ తనతో నా దేవాలయమునకు దీసి కొనిపోయి, యాలయముచుట్టునున్న తోటనుజూపించెను. ఆసందర్భమున రాణి తనకుమారుని నొక మహావృక్షము యొక్క నీడల బెఱుగుచున్న పొదలగుంపులయొద్దకు దీసికొని పోయెను. అచ్చట నామెయొకసారి పెద్దనిట్టూర్పు విడిచి, "థీసియస్ కుమారా! యాపొదలోనికిబోయి, యావృక్ష మూలముననున్న యాపెద్ద పలకఱాతినెత్తి, దానిక్రింద నేము న్నదో దానిని నాకు దెచ్చియి"మ్మని పల్కెను.

ఆ వీరకుమారుడు తల్లివాక్యము నాలకించి, యతి సాహసమున నాముండ్లపొదలలోజొచ్చి, దట్టముగా బెఱిగి యల్లుకొనియున్న యాపొదలు చిరకాలమునాటివని యెఱిం గెను. అందున్న ఱాతిపలకపై బల్లేఱు మున్నగు ముండ్ల కాయల తీగెలును, నాచును గాఢముగా పెఱిగిచుట్టుకొని యుండెను. అతడు వానిని బైకెత్తఁ బ్రయత్నించెను. గాని విఫలమనోరథుడయ్యెను. తిరిగి ప్రయత్నించెను. మేనెల్ల, చెమటలుబోసెను. అభిమానముచే నతనికన్నులవెంట గన్నీరు గాఱెను. కాని యతని ప్రయత్నము సఫలముగాలేదు. అంత నతడు తనతల్లి యొద్దకుబోయి "అమ్మా యాచెట్టుమొదట నున్న ఱాతినిగనుగొంటిని. కాని దానినెత్తుట నాకుసాధ్యము కాలేదు. మననగరములో నెవ్వడును నాఱాతిపలక నెత్తగల డని నాకు దోచుటలేదు.

ఐత్రారాణి యప్పుడు నిట్టూర్పువిడిచి "నాయనా! దైవము చిరకాలము మానవులశోధింతురు. కాని తుదకు

వారు న్యాయమునే జేయుదురు. మఱియొక సంవత్సరము గడువనిమ్ము. నీవు ట్రోజీన్ నగరవాసు లందఱికంటెను నధిక బలవంతుడవుగాగల దినము రాగలదు.” అనిపల్కెను.

అనంతరమా రాజ్ఞి యతనిచేయి బట్టుకొనిపోయి, దేవునిబ్రార్థించి, యతనితోగూడ నింటికిబోయెను. మఱి యొకసంవత్సరమట్లు గడచినతరువాత తిరిగి యామె థీసియసు నా దేవాలయములోని ఱాతియొద్దకు దీసికొనిపోయి దానిని ఎత్తుమని యానతిచ్చెను. గాని యతడప్పుడును నాఱాతిని పైకెత్తలేకపోయెను.

అట్లే యేడాదికొకసారి యారాజు సాధ్వి కుమారునిచే నాఱాతినెత్తింపవలయునని ప్రయత్నించెను. కాని వారికి గార్యసిద్ధిగాలేదు. ఆఱాతిక్రింద నేమున్నదనియు, దానికర్థమే మనియు థీసీసు తనతల్లినడుగ నిచ్ఛగించెనుగాని, యామె ముఖము సవిచారముగ నుండుటచే, నడుగ సాహసింపలేక పోయెను.

“ట్రోజీన్ ప్రాంతమున నెవ్వడును దీనినెత్తలేక పోయినను, నేనెత్తగల దినము నిశ్చయముగా రాగల”దని థీసీసు నిశ్చయించుకొనెను. నాఁడు మొదలుకొని యతడు ఘనమైన యంగబలము నార్జించుటకు వివిధ శరీర సాధనములు సేసెను. మిత్రులతోఁ గుస్తీలుపట్టెను. ముష్టియుద్ధములుసేసి గెలుపొంద నారంభించెను. పెద్దపెద్ద యినుపగుండ్లు మొదలగు వానిని విసరివేయ నారంభించెను. అశ్వములను స్వాయత్తము లను జేసికొని వానిపై స్వారిసేసెను. అడవిపందులను, అడవి

యెద్దులను, జింకలను, దుప్పులను గుట్టలలోనికిదఱిమి వెన్నంటి వేటాడసాగెను. కొంతకాలమునకు థీసియసు అతివేగముగ వేటకాఁడయ్యెను. భూమిపై బైరుల నాశముసేయు పెద్దపందిని నుఱుమాడెను. ప్రజ లీతని జూచినప్పుడు నిశ్చయముగా నితఁడు దైవానుగ్రహము గలవాడని కొనియాడసాగిరి.

థీసియస్కు పదునెనిమిది సంవత్సరములు దాటిన తరువాత, ఐత్రారాణి యాతనిని మఱియొకసారి కొండమీఁది దేవాలయమునకు దీసికొనిపోయి "థీసియస్, కుమారా! నేడీరాతిని దప్పక లేవనెత్తుము. అట్లు కాదేని నీవెవ్వరవో తెలిసికొనకుండుము"అని పట్టుదలతో వాకొనెను.

పదంపడి థీసియసు, పొదలలోనికిబోయి రాతియొద్ద నిలుచుండి యటునిటు నూపిచూచెను. అది యించుక కదలిక చూపెను. అంతనతని చిత్తమున నుత్సాహ ముదయించెను.

నాశరీరములోని గుండెకాయ వ్రయ్యలగునుగాక. ఈ ఱాయిలేచి తీరవలయునని నిశ్చయించి మిఱియొకసారి దాని నూపెను. మఱియు లేవదీసెను. పైకెత్తి దానిని భూమిపై పొర్లించి విజయధ్వని సేసెను.

థీసియసు ఆఱాతికిరింద నెమకిచూడగా, బంగారపుపిడి గల యొక లోహపుఖడ్గమును, దానిప్రక్క రెండు బంగారపు పాఁకోళ్ళను నుండెను. ఆవస్తువులనతఁడు చేతులతో నెత్తి నెత్తిపై నుంచుకొని పొదలగుంపులనుండి బయలుపడి, తల్లి దగ్గఱకుఱికెను.

ఆమె యాఖడ్గమును, బాహోళ్ళనుజూచి యేమియు మాటాడక, తనమనోహర ముఖారవిందమును బైసాలువతో గప్పి పెద్దతడవు దుఃఖించెను. థీసియసు ఆశ్చర్యచకిత చేత స్కుడై యామెప్రక్క నిలిచి, దుఃఖింపసాగెనుగాని, తనతల్లి యెందులకేడ్చెనో యతనికిదెలియదు. తానెందులకేడ్చుచుండెనో యతనికే తెలియకుండెను. ఏడ్చియేడ్చి యామె తుదకు వేసటజెంది, ముఖముపై నివస్త్రమును దొలగించి, తల యెత్తి, తనయంగుళిని నధరోష్ఠముపై నిడికొని, థీసియస్ వంకజూచి, "కుమారా! వీనినిగురించి యెరులకుదెలుపక, మనస్సులో నుంచుకొనుము. నావెంటవచ్చి, సముద్రము నవలోకింపుము." అనిపల్కెను.

అట్లు వారుభయులును దేవాలయపు గోడనుదాటి తగుతావుననిలిచి సముద్రమువంక నీక్షించిరి.

ఐత్రా—"పుత్రకా? మనకాలిక్రిందిభూమిని జూచితివా? దీని నేమందురు?"

థీసియస్—"చూచితిని. దీనిని ట్రోజీక్ అనిపిల్తురు. ఇందే నేను పుట్టిపోషింపబడితిని."

ఐత్రా—ఇదియొక చిన్నప్రాంతము. సస్యవృద్ధిలేని జాతి నేల. ఈశాన్యముఖముగానున్న పర్వతశిఖరములవంకజూచు చున్నట్లున్నది. ఆయెదురుగా నగపడుచున్న భూఖండమును జూచితివిగదా?

థీసియస్—"అవును. అది అత్తికాదేశము. అందు అథీనియన్లనుప్రజలు నివసింతురు."

"కుమారా! అదివిశాలమైనది. పుష్కలముగ బంటలు పండు నల్లభూమి. దానిచూపు అవిరామ సూర్యకిరణ ప్రసారముగల దక్షిణదిశ నవలోకించుచున్నది. అందు మంచినూనెయు దేనెయు విస్తారముగ నుత్పత్తియగును. దానిచుట్టును నునుమెత్తని శిలలతో నిండియున్న వెండికొండలున్నవి. ఆకొండలలో మధుఫలదాయకములగుతరువులున్నవి. పెక్కులు విశాలములైన పచ్చిక బయళ్ళున్నవి. నికుంజాగ్రములయందు కోకిలలు గూయుచుండును. నిరంతరము నందు సెలయేళ్ళు ప్రవహించుచుండును. అవి యధికజనసంఖ్య గలిగియున్నవి. అందలిప్రజలు అనాదిజాతి జన్ములు. పుడమి తల్లికుమారుడగు నాగరాజు సంతతివారైన యీజనులు సుగంధబంధురములైన చాంపేయచంపక పుష్పములచేఁ గుంతలముల నలంకరింతురు. నీవాప్రదేశమునకు రాజువైనచో నీ వేమిసేయనిచ్ఛగింతువు?"

థీసియసు సముద్రమున కావలనున్న యీ ప్రదేశము నత్యాశ్చర్యముగ నాలోకించెను. కొంచెమెత్తైన పర్వత శిఖరములచే జుట్టబడిన యీ థేను మహామహీధర సీమనలంకరించుచున్నను, ఏజీనాపర్వతము దానికడ్డముగా సముద్రతీరమున నిల్చియుండుటచే నది యతని దృష్టి పథమునకు గోచరమగుచుండలేదు.

దాని జూడజూడ నాతనిమానస ముప్పొంగ నతడిట్లనెను. "నేనీదేశమునకు నేలికనైనచో జ్ఞానబలసంపత్తిచే దానిం బరిపాలించి, ప్రజల నానందపఱచి వారి నిత్యానురాగమునకు బాత్రుడనగుదును." ఆవాక్యముల నాలకించి మైత్రా

రాణి మందహాసము సేసి, "వీరకుమారా! అట్లయినచో నీవీ పాకోళ్ళను శస్త్రరాజమును దగ్గఱనుంచుకొని, ఏథెన్సు దేశపు రాజైన ఏజియస్ రాజునొద్దకుబొమ్ము. అతడు పల్లాకొండపై నవసించుచుండును. "సిలాఫలకమెత్తఁ బడినదని చెప్పి ఈవా గ్దాన మెవ్వరిదని యడుగుము. ఈకరవాలమును, పాకోళ్ళను యతనికి చూపి దేవతలు యనుగ్రహించిన దానిని గైకొని రమ్ము. అని తల్లి చెప్పెను. థీసియసు పెద్దపెట్టున "అమ్మా! నిన్ను నేను విడిచిపోవలసిన దేనా" యని యేడ్చెను.

ఐత్రా—నాకొఱకు నీవేడువవలదు. జరుగవలసినది జరిగితీరవలయును. ఏద్చుటయేగాని రెండవపని చేయనివారి కేడుపు సులభముగావచ్చును. నాశైశవమును, యౌవనమును విచారముతో నిండియుండెను. ఈవిచారము, కృతఘ్నుడైన నీతండ్రివలనను, నీవలనను నాకు గలిగినది. నాతండ్రిచేఁ గుట్ర వలన పంపివేయబడిన పిమేరాను జంపిన బెల్లరోఫాను కారణ మున నాబాల్యము విషాదపూరితమయ్యెను. నన్ను మోస గించి పోయిన నీజనకుని కారణమువలన విషాదమేగాక నీ వెప్పుడు పెద్దవాడవై వీరపురుషుడవగుదువా యను విషాదము గూడ నానడిప్రాయమును విషాదగ్రస్తము చేసినది.

నావార్థక్యముగూడ విచారమయము గాగలదని, నాకు గలుగుచున్న స్వప్నములనుబట్టి తెలియుచున్నది. నావార్థక్య వృత్తాంతము చెప్పెదను వినుము. స్వాన్ రాజకుమారులు నన్నుబట్టుకొని యూరేటాస్ లోయలో బంధింతురు. నేను గ్రీసుదేశ శత్రురాజునకు దాసినై సముద్రముమీద ప్రయా

ణముచేసి యానిర్బంధము బాపుకొందును. ఈకసి నేను దీర్చుకొనకపోను. స్వర్ణకేశులైన వీరపురుషులు ట్రాయ్ నగరముపై దండెత్తి, యిల్లియమ్ రాజసౌధములను దోచుకొనునప్పుడు నాకు మనశ్శాంతి గలుగును. నాకుమారుడప్పుడు నాబానిసతనమును దొలగించును. థీసియసుయొక్క కీర్తిని నేనప్పుడు విపులముగావిందును. ఆతరువాతసైతము నాకు క్రొత్తవిపత్తులువచ్చును. కడచిన విపత్తులను సహించినట్లు క్రొత్తవిపత్తులను గూడ నేను సహింపగలను.

ఇది నా భవిష్యద్వృత్తాంతము. నీశౌర్య సాహసములు రాగలకాలమున నాకు విపద్విమోచనము చేయగలవు." అని పల్కి ఐత్రారాణి కుమారుని మూర్ధాఘ్రాణముసేసి, కౌగిలించుకొని యేడ్చెను. ఆమె దేవాలయములోనికిఁబోయెను. థీసియస్ ప్రేమరాశియగు మాతృదేవిని విడిచి, యామె యాదేశము ప్రకారము పయనముచేసి యదృశ్యుడయ్యెను.

# వీర పురుషులు

## థీసియసు

## ద్వితీయ భాగము.

## థీసియసు మానవాదులను జంపుట.

తొలుదొల్త థీసియసుచిత్తము అత్యంత ధైర్యపరిపూరితమైయుండెను. అచ్చటినుండి యోడరేవునకుబోయి, శీఘ్రముగాబోవునొకను బాడుగకు నియమించుకొని యేథెన్సునకు బోవలయుననుకొనెను. కాని యతడు తనతండ్రినిజూచు నాతృతలో, "నాకు గరుత్మంతునకువలె రెండుఱెక్కలున్నచో దటాలుననెగిరి సముద్రముదాటిపోయి యుందునుగదా యని వేగిరపడుచుండెను. కానికొంతతడవున కతనికొక నిరుత్సాహకర పర్యాలోచన ముదయించెను.

"ఇప్పుడునాతండ్రి నివసించుగృహమున బెక్కుమంది కుమారులుగలిగియుందురు. వారియందే ఆయనకు ప్రేమాధిక్యముండును. నాయందుప్రేమజూపక నాకుస్వాగతమొసంగనిచో నేనేమిచేయవలయును? ఆయన నన్ను ప్రేమించుటకు ఆయనకు నేనేమిచేసితిని? నేను పుట్టినప్పటినుండియు నన్నతడు మఱచియేయున్నాడు. ఇప్పుడు నన్నతడేల ప్రేమించి గౌరవించును?" అని పరిపరివిధముల విచారము సేసెను.

ఈవిధమునఁ గొంతతడవు విచారించి, యొక్కయాశా కిరణముచే బ్రోత్సహింపబడి "అవును, నన్ను నాజనకుఁడు ప్రేమించులాగునఁ జేసెదను. జనకుని ప్రేమకు నేనర్హుఁడనని యాయనకు దోచునట్లు మహాకార్య నిర్వహణముచేసి ధ్రువ పఱచెదను. కీర్తిగౌరవముల నార్జించెదను. మేజియస్ రాజుకు ఏబదిమంది కుమారులున్నను, నతఁడు నన్నే ప్రేమించఁ బ్రోత్స హించు ఘనకార్యముల సాధించెదను. హెర్క్యులసు, విపన్ని మగ్నుఁడయినను నమోఘమైన గౌరవము నార్జింపలేదా? యూరస్థియస్ సేవకుఁడు లోకగౌరవప్రశస్తుల నార్జించి యుండఁడా? అతఁడజేయులగు చోరులను జక్కాడెను. దుష్టము లైన యాటవికమృగములను నుఱుమాడెను. సరోవరముల నింకించెను. జలాశయముల నెండించెను. కరగతదండముచేఁ బర్వతములబగులగొట్టి మార్గముల నేర్పఱచెను. ప్రజలయాప త్తుల నివారించెను. వారిజీవితముల కానందము జేకూర్చెను. ప్రజాసంతతికి సౌఖ్యాకరములైన జీవితవిధానముల నిర్మాణము సేసియుంచెను. అందువలననేగదా, ప్రజలకాతనియం దధిక గౌరవాదరములు గల్గెను.

అట్టి సాహసకృత్యములను సాధించుటకు నేనెచ్చటికి బోవలయును? చోరులు, పెనుభూతములు, నరకసంతానము, మనుష్యశాత్రవులు మున్నగు వధార్హులు నాకెక్కడలభిం తురు? కావుననేను, సముద్రయానముసేయక భూమిపైఁ బాదచారినై పయనించెదను. కొండలోయలలో తిరిగిచూచె దను. ఇస్తమస్ భూసంధిచుట్టునుదిరిగి వెదకాడెదను. బహుశః అచ్చటనాకు ధైర్యసాహసప్రదర్శనము సేయదగినయవకాశ

ములు లభింపవచ్చును. అట్టిసాహస ప్రదర్శనమువలన నా తండ్రిప్రేమను నేనాకర్షింపగలుగుదును." అని వితర్కించుకొని, భూమిపై ప్రయాణముసేయ నిశ్చయించుకొనెను.

థీసియసు కొంతదూరము నడచిపోవగా, పర్వతప్రాంత మగపడెను. ఆపర్వతములను స్పైడర్ పర్వతము లందురు. అప్పుడతని తండ్రి యొక్క కరవాల మతని నడుమున వ్రేలాడుచుండెను. స్పైడర్ పర్వతముల నడుమ నొకయెత్తైన శిఖరము గల గుట్టయుండెను. ఆ యగ్రిము చుట్టును లోతైన లోయ లుండెను. ఆపర్వతము మధ్యభాగమునుండి లోయలవఱకు సాలీడు పెద్దపెద్ద వలలల్లుచుండును. ఈవలలోనుండి యే లోయలలోనికి సూర్యకిరణములు ప్రసరించు చుండుటచే, నందు వెలుతురు తక్కువగానుండి యవి పెద్దప్రొద్దు గాఢాంధకార పరివృతములై యుండును. క్రిమక్రిమముగా నతడధికోన్నత ప్రాంతమునకు బోవుటవలన మేఘముల చెమ్మం దలకు దాకనారంభించెను. కాలిక్రింద నేలతడిగా నుండెను. అన్ని ప్రక్కలను జలాఖాతములు గానవచ్చెను. శిలలన్నియు హిమ సమాచ్ఛన్నములై యుండెను. ఆ అఖాతముల మీదుగా నతడు ముందుకుసాగి పోవలసివచ్చెను. సరియైనబాటలు యేప్రక్కకును లేకుండెను. ఆమంచు బండలలో నుండి, శ్రమసేసికొంత దూరము పోవువఱకు అతనిమ్రోల నొక రాళ్ళగుట్ట యగపడెను.

ఆరాళ్ళగుట్టపై, భల్లూకచర్మాంబరమును ధరించిన యొక మనుష్యుడు కూర్చుండియుండెను. ఎలుగుబంటి తల

భాగమతనికి దలపై ని కుళ్ళాయిగానుండెను. అతని కనుబొమ లపై భల్లూకదంతము లమర్చబడియుండెను. ఎలుగు పాదము లతని కంఠమునఁ జుట్టబడియుండెను. ఎలుగు పంజాలు వాని యురస్థలమున బ్రకాశించుచుండెను. ఆ వికృతస్వరూపుడు థీసియసును జూచినవెంటనే లేచి నిలుచుండెను. మఱియు లోయకనుమలు ప్రతిధ్వనించు నట్లుగ నత డట్టహాసము చేసెను,

"సాలీడు అల్లిన అల్లికలోనికి నడచివచ్చిన నీవెవ్వడవు ?" అని మానవుడడిగెను. థీసియసు వానిమాటలలక్ష్య పెట్టక నిశ్చలముగా దనత్రోవనే యరుదెంచుచుండెను. అతనిప్రశ్నకు బ్రత్యుత్తరమీయలేదు. కానియతడు "ఇత డొక చోరుడా! నాకొక సాహసకృత్యము సన్నిహితమైనదా? యని తనలో ననుకొనెను.

ఆ వికృతాకారుడు మిక్కిలి బిగ్గరగా నవ్వి యిట్లనెను. "ఓసాహసమూర్తీ! ధైర్యశాలీ! ఈకనుమలలోనికి వచ్చిన వాడు తిరిగి బయటపడజాలడని యెఱుగుదువా? ఈలోయల యందలి యల్లికలు నాచే నల్లబడినవి. నేనే సాలీడు వృత్తి గలవాడను. వలలో జిక్కుపడిన యీగలను సాలీడు కబళించి నట్లు ఇచ్చటికి వచ్చినమానవులను నేను గబళించుచుందును. వారిరక్తమును నేను ద్రావుచుందును. నాతండ్రియగు హిఫా యిస్టాసు ఈశిలాసముచ్చయమున విచిత్రకరములగు నల్లిక లేర్పడఁజెక్కి, సాలీడు నల్లికవంటి యల్లికను నాకు స్వాధీన పఱచెను. ఈజాతి యల్లికనుండి యింతవఱ కెవ్వడును,

బయల్వెడివోలేదు. నాదగ్గిఱకురమ్ము. నేను నిన్ను నాయాహారము సేసికొందును." అందులకు నిశ్చలచిత్త వృత్తియగు థీసియసు, నిర్భీకముగా ముందునకుబోయి యతని సమీపమున నుండి "ఓ ధైర్యశాలివగు సాలెపురువా! మానవులు నిన్నేమనిపిల్తురు? సాలెపురువునకుండు కోరలు నీకెక్కడ నున్నవి?" యనియడిగెను. ఆవిచిత్రాకారుడు, మఱియొక సారి ప్రస్ఫుటముగా హాస్యము నొనరించి,

"నా పేరు పెరిఫిటోసందురు. గిరిదేవతయగు ఆంటిక్లియాకును, హిఫాయిస్టాసుకును నేను జన్మించితిని. మానవులు నన్ను (దండధారి, కొరైనిటీస్) అందురు. ఇదిగా నాసాలెపురుగు కోర ఇందున్నది." యని యాతని ప్రక్క రాళ్ళ గుట్టలోనున్న యొక లోహదండమును పైకిదీసి చూపెను.

"దీనిని పర్వతమూలప్రదేశమున సిద్ధముచేసి నాతండ్రి నాకొసంగెను.

నాయొద్దకువచ్చు బలాఢ్యులనుబట్టి దీనితో వారిగర్వమడంగ మర్దించి, వారిమేనిక్రొవ్వును, మాధుర్యమును నేనారగించెదను. కావున నీచేతనున్నకత్తిని బంగారపు పాకోళ్ళను, నాకొసంగుము. కాదేని నిన్నుమర్దించెదను. నీవు దురదృష్టము వలన మరణించెదవు. అని యావికృతమూర్తి వాక్రుచ్చెను.

అప్పుడాబాలవీరుడు తనపైవలువ నెడమచేతి మణికట్టు నుండి భుజమువఱకునుజుట్టి, దక్షిణహస్తమునఁ గృపాణమును ధరించి, బిరబిరద్రిప్పుచు నాదండధారిపై కుఱికెను. దండధారియు నావీరునిపై కలివేగముతో నుఱికెను.

అతడు థీసియసును ముమ్మారు నెత్తిపై దండముతో గొట్టెను కాని థీసియస్ వస్త్రముచేజుట్టబడిన వామహస్తము సాహాయ్యమున శీర్షమును గాపాడుకొనెను. ఎడమచేతి వస్త్రమును జెదరనీయలేదు. దెబ్బదెబ్బకును ప్రవాహవేగమున వంగు లేతమొక్కవలె వంగి తిరిగి లేచుచుండెను. థీసియసు తనఖడ్గముతో దండధారిని ముమ్మారు పొడిచెను. కాని యతనిపై వ్రేలాడు భల్లూకచర్మమువలన నతని కపాయము గలుగలేదు. అంతట థీసియసు ఆగ్రహమువహించి దండధారి మీదకురికి యతనికంఠమును బట్టుకొనెను. వారుభయులును గొంతవడి పెనగులాడిరి. థీసియసు వానిని నేలకదిమి నులిపి విగతజీవుని జేసెను. థీసియసు లేచి నిలుచుండెను. దండధారి శవమచ్చట బడియుండెను.

థీసియస్ వాని దండమును భల్లూక చర్మమును దీసికొని, యతని కళేబరమును గాకులకును గ్రద్దలకును విడిచి వైచెను. పదంపడి థీసియసు ప్రయాణముసాగించి పర్వతమున కావలిప్రక్కకు మెల్లగాదిగి విశాలమైన పచ్చికబయలునకు జేరెను. అందుగల తరునీడల యందు పశుసమూహములు కడుపార మేసి పండియుండెను.

నిర్మల జలప్రవాహమున కొక ప్రక్క దరుశిలాచ్ఛాయలయందు, గొఱ్ఱెలకాపరులు దేవకన్యకలును గలిసి నృత్యము సేయుచుండిరి. వారినృత్యముల కనుకూలముగ వాద్యము సేయువారెవ్వరును లేకుండిరి.

వారు థీసియస్‌ను చూడగనే కేకవైచిరి. గొఱ్ఱెల కాపరులు పాఱిపోయిరి. దేవకన్యకలు ప్రవాహమున దుమికి యదృశ్యలైరి.

థీసియసు వారినిజూచి యచ్చెరువుపడి మందహాసము సేసెను. ఇచ్చటిజనులు సంగీతసాహాయ్యములేక నృత్యము సేయుటయు, పరదేశీయులనుజూచి పాఱిపోవుటయు నతనికి విస్మయము గలుగజేసెను. అతడు ప్రయాణభారమున నలంత గొని, దప్పిగొనియుండెను. అతనివలువలు ధూళిధూసరములై యుండెను. అందువలన నతడు వారి నృత్యమును గుఱించిన విచారము నంతటితో వదలివేసెను.

థీసియస్ నిర్మలజల ప్రవాహమున మజ్జనమాడి, దప్పి దీర్చుకొని, తీరస్థమగు నొకవటవృక్షము నీడయందు విశ్ర మించెను. ప్రవాహ జలములొక శిలనుండి మఱియొక శిలపై కుఱుకుచుజేయు మధురస్వరము లాయువకునకు లాలిపాటలై యతనిని నిదురింపజేసెను.

అతడు మేల్కొనినప్పుడు రహస్యస్వరములు అతని వీనులంబడెను. ప్రవాహమున కావలిప్రక్కనున్న గిరిగుహా ముఖమున నాచుచే నావరింపబడిన గండశిలలపై గూరుచుండి ప్రవాహము మీదుగా దేవకన్యక లాతనివంక జూచుచుండ నా వీరపురుషు డాయువతుల నవలోకించెను. ఆ దేవకన్యక లలో నొక్కతె "ఇతడు పెరిసిటీస్ కాఁడని సంభాషించెను." మఱియొక్కతె "యితడు ద్రోవదోపిడిగాసవలె గానవచ్చుట

లేదు. అంతియగాక శాంతియుతుడైన సుందరయువకునివలె నగపడుచున్నాడని వాకు ప్రిచ్చెను.

అంత నాబాలవీరుడు చిఱునవ్వునవ్వి, "దేవకన్యక లారా! నేనుపెరిఫిటీసునుగాను ఇప్పుడతని మృతకళేబరము కాకులు గ్రద్దలపాలైనది. వాని భల్లుకచర్మమును, వానిదండ మును నేనుదీసికొని వచ్చినాను." అని బదులుపల్కెను.

అప్పుడు వారు తత్ప్రవాహమును దాటి, యతని యొద్దికివచ్చి యావలికిబోయిన గొల్లల కాపరులను బిలిచిరి. వారందఱును జెట్టునీడ నానందముతో గూర్చుండియుండ, నావీరయువకుడు, తాను పెరిపిటీసును వధించిన విధానమును జెప్పెను. గొల్లవాండ్రు వీరుని పాదములకు నమస్కరించి యానందకరములగు పాటలుబాడిరి. "ఇకఁ మేము మా మంద లను శాంతితో మేపుకొందుము. మానృత్య సమయముల యందు గాయనముల బాడుకొనుటకు భీతిచెందము. క్రూరు డైన దండధారిని శూరకుమారు డంతమొందించెను. ఆదుష్టు డింక మాగానముల నాలకించునను భీతి తొలగిపోయినది." అని పల్కి యనేక విధమ్ముల నాతనిగొనియాడిరి. గోపాలు రతనికి వివిధములగు ఫలములను భోజ్యపదార్థములను దెచ్చి యిచ్చిరి. దేవకన్యకలు శిలాప్రాంతములనుండి తీయు తేని యనుదెచ్చి త్రావించిరి. అతడు కడుపారభుజియించి, తేనియం ద్రావి యానంద పరవశుడై తరులతాచ్ఛాయ యందు విశ్రాంతిగైకొనెను. గొల్లలును దేవకన్యకలును నృత్యగాయ నములచే నుపచారముల జేయుచుండ సల్లసనతడుసుద్రించెను.

థీసియసు నిదుర మేల్కాంచినప్పుడు వారు "నీవిక్కడ గొంతకాలముండు" మని యభ్యర్థించిరి. అందులకతడు నాకు చాల పెద్దపనియున్నది. నేను ఏథెన్సుకు శీఘ్రముగ జేరుకొన వలయును గాన నేడు ఇస్తమస్ భూసంధి దఱికి బ్రయాణము చేసెదనని పల్కెను.

గొల్లలు—ఏథెన్సు ప్రాంతమునకు నీవొంటరిగా బ్రయాణము సేయుదువా? వలదు. సాయుధులైన సైన్యములను వెంటనుంచుకొనినవారు గాక మఱెవ్వరును నాప్రక్కకు బ్రయాణము సేయరు."

థీసి—"నా యొద్ద నాయుధము లున్నట్లు మీకగపడుచునే యున్నది. న్యాయతత్పరుడగు వీరునకు సైన్యముతో బని లేదు. న్యాయమే యతనికి బలము. అందువలన నేథెన్సు ప్రాంతమునకు నేనొక్కడను బోయిన నేమగును?"

గొల్ల—"అట్లు నీవు ప్రయాణముచేసినయెడల, ఇస్తమస్ వద్ద నీవు జాగ్రత్తతో మెలంగవలయును. అందొక దోపిడిగాడు కలడు. అందు రెండు పెద్ద పొడవు వృక్షములు గలవు. సినిస్ అను దోపిడిగాడు బాటసారుల నారెండు మ్రాకులను మధ్యకువంచి వాటినడుము, బంధించును. ఒక చేయియు నొక కాలును నొక చెట్టునకును, రెండవ చేతిని. రెండవకాలును రెండవ చెట్టునకును నంటగట్టి వెనుక నావృక్షములను దగ్గిఱకు వంగునట్లు చేయుటకు గట్టిన రజ్జువు నూడదీయును. మ్రాకులు నిలువుగా నిలువబడినప్పుడు, బాటసారులు రెండు చీలికలుగా జీలిపోవుదురు. ఈవిధముగా బాట

సారుల నతడు హింసించుచున్నాడు." అని యొకడు వాకు
చ్చెను. అంత మఱియొక గొఱ్ఱెలకాపరి యిట్లనెను.

"అటు తర్వాత నీవు ప్రదేశాంతర్భాగమునకు బోవల
యును. సైరన్ కొండలమీదుగా బోవుటకు సాహసింప
గూడదు. ఏలయన నెడమచేతి వైపున గొండలుండును.
కుడిచేతి వైపున సముద్రముండును. ఆత్రోవనే బోవుచో
సైరన్ నివాసమునకు బోకతప్పదు. అతడొక పెద్ద దొంగ.
బాటసారిని దనపాదములకు గడుగ నాజ్ఞాపించును. పాదము
లను గడుగుసమయమున నొక తన్ను దన్నును. దానితోం
బాంధుడు కొండమీదుగా నెగిరి యావలకిందబడును. ఆ
క్రిందిభాగమున నొక కూర్మము నివసించుచుండును. అది
మృతకళేబరములను గబళించుచుండును."

రెండవవాడు ముగించగనే, మూడవ గొఱ్ఱెలకాపరి
యిట్లు వచింపదొడంగెను. "నీవెప్పటికిని భూభాగములోనికిం
జొచ్చుకొని పోవలయును. కాని యెలూసిస్ దేశము నీకు
గుడిభాగమున గానవచ్చును. ఆదేశమునకు నీవుపోరాదు.
ఆదేశమును సెర్స్యాన్ అనురాజు పరిపాలించుచుండును.
అతడు మర్త్యుల కెల్లరకును భయంకరుడు. అతని కుమార్తె
యగు ఎలోప్ చెరసాలలోనుండగా నతడే స్వయముగా
నామెను భుజంపెను. ఆకుమార్తె నతడొక సరోవరముగా మార్చి
వైచెను.

ఎలోప్‌కు ఒకబిడ్డయుండెను. ఆబిడ్డనతడు కొండలమీద
బాఱవేయించెను. అడవిపక్షులమూలా శిశువునకు బాలొసంగి

పోషించెను. ఇప్పుడు క్రొత్తగావచ్చిన బాటసారులందఱును దనతోకు స్తీసట్టుటకు బిలచును. అతడు కుస్తీపట్లను బాగుగా నేర్చినవాడగుటచే, క్రొత్తవారి నోడించుచుండును. జయింపబడినవారి నందఱను నతడు దాక్షిణ్యరహితముగా జంపివేయును. ఆయన రాజసౌధమంతటను నట్లుచంపబడినవారి యెముకలతోనిండియుండును."

థీసియస్ తత్సమాచారమువిని యసంతృప్తిని బ్రకటించెను. "ఈ భూమియందు దుష్పరిపాలనమగలదు. ఇచ్చట సాధింపదగిన సాహసకృత్యములు పెక్కులున్నవి. నేనీరాజ్యమునకు అధికారము గలవాడనైనచో దానిని జక్కబఱచగలను. ఈనా రాజ్యచిహ్నమైన దండముతో నాభూమియందు ధర్మసంస్థాపనము సేయగలను." అని తనచేతనున్న లోహదండమునాడించెను. గొల్లవాండ్రును దేవకన్యకలును నతని చుట్టునుమూగి, అట్లుపోవలదని బ్రతిమాలుకొనిరి.

వీరయువకుడామాటలను బరిపాటిసేయక, భూమిపైననే తనప్రయాణము సాగించెను. కొంతదూరము పోవుచఱకు నుభయసముద్రములును, అత్యున్నత ప్రదేశముననున్న కోరింత్ నగరమును నతనిదృష్టిపథమునకు గోచరమయ్యెను. క్రూరచోరుడైన సినిస్‌ను గలిసికొనవలయునని యతనిభావము మిక్కిలి యాతురపడుచుండెను. ఇస్తమస్ భూసంధి మిగుల సన్ననై, బాటమహోన్నతపర్వతములమధ్యనే సియమితమై, యున్నతావున నడచుచు నొకమహాబూగుహావరి వ్యాప్తమైన యరణ్యప్రదేశమున నతడు సినిస్‌చోరుని గన్గొనెను. చోరుడు

బాటప్రక్కనున్న యొకరాతిపై గూర్చుండియుండెను. అత డొకవృక్షమును కేలుకర్రగాజేసికొని దానిని దనజానువులపై బెట్టుకొనియుండెను. అతనిప్రక్క నొకరజ్జువు సిద్ధముగా నుండెను. అతనిశీర్షమునకుసూటిగా పై భాగమున గొమ్మలకు గట్టబడి, మృతజీవులయెముకలు వేలాడుచుండెను.

థీసియస్ వానినిజూచి బిగ్గరగానార్చి పిలచి "ఓయీ నాకొఱకు రెండు దేవదారువృక్షములను సిద్ధపఱచి యుంచి తివా?" యని యడిగెను.

సినిసు నేలమీదిక్రుకి, తనతలపై నవ్రేలాడు నెముకల తోరణముల గనఁబఱచుచు, "నాభోజ్యశాల నాలుగుదినముల నుండి పదార్థశూన్యమై యున్నది. నీకొఱకు రెండు దేవదారు వృక్షములను సిద్ధముగానుంచినాను." అనిచెప్పి తనకరదండము నెత్తి థీసియస్‌పై కుఱికెను. థీసియస్ సినిస్‌పై కుఱికెను. ఉభ యులకును ఘోరమైన పోరాటముజరిగెను. వారిదండప్రఘాత ములకు నడవియెల్ల మాఱుమ్రోగెను. కొయ్యకంటె లోహము కఠినమైనదగుటచే, దారుదండము కొంతసేపటికి నడిమికి విరిగిపోయెను. థీసియస్ ఆసమయమున నాక్రూరుని శీర్షముపై నొక్కపెద్దదెబ్బగొట్టెను. వీరపురుషుడా మానవారి నేలకుగూలినవెంటనే వానిమూపునెక్కి కూరుచుండి వాని త్రాటితో వానినే గట్టిగబిగియగట్టి "నీవొరులకు జేసినప్రకా రము నేడు నీకుజరుగగలద"ని సరోషముగ బల్కెను. అంత నాధీరుడు రెండు దేవదారువృక్షములనువంచి వానినారెంటి నడుమనగట్టివైచెను. సినిస్ గిలగిలతన్నుకొని పలువిధముల

నాబాలవీరుని ప్రార్థించెను. కాని యాక్రూరకర్మునియందు వీరుడు దయఁబూనక నాచెట్లను విడిచిపెట్టెను. మానవారి మేను వ్రయ్యలయ్యెను. అతనిమృతకళేబరమును గాకులకును డేగలకును నాహారముగావిడిచి, థీసియసు తనప్రయాణమును సాగించెను.

అచ్చటినుండి థీసియసు గుట్టలదాటి మెగారాదేశము వైపునకు బయనించెను. ఒకప్రక్క సముద్రముండెను. రెండవ ప్రక్క నెత్తైన కొండలుండెను. పోవఁబోవఁ దారి సన్నమయ్యెను. కొంతసేపటి కతఁడు సైరన్ గుట్టలకు జేరుకొనెను. అచ్చట నొక సెలయేఱు ప్రవహించుచుండెను. దానిప్రక్క సన్న గండశిల యంచున సైరను కూర్చుండియుండుట నతడవలోకించెను. అతని మోకాళ్ళపై నొక దండముండెను. సైరను బాటకు నిరోధము గలుగునట్లుగ దారిలో రాళ్ళు ప్రోగువెట్టి యొక కట్టనేర్పఱచెను. ఆమార్గమునవచ్చిన ప్రతి మానవుడును నచ్చట నాగవలసియేయుండెను. వానింజూచి థీసియసు దూరమున నుండియే, "ఓరీ, కూర్మోదర పోషణముసేయు క్రూరకర్ముడా! నేడు నీపాదములకు బ్రక్షాళనముగావలయునా?" యని యెలుగెత్తి యార్చెను.

అప్పుడు సైరను క్రిందికుఱికి, నాతాబేలు నేడు నిరాహారియై యాకలిగొనియున్నది. నాకు బదప్రక్షాళనము గావలయునని, ప్రత్యుత్తర మొసంగి, యారాతికట్టమ్రోల నిలువఁబడి, రెండుచేతులతోఁ దన కరదండమును బైకెత్తెను.

థీసియుసు పరమోత్సాహముతో వానిపై నుఱికెను. ఆ ఇరువురకును, నాశిలాఘట్టమువద్ద ఘోరయుద్ధము జరిగెను. సైరను లోహదండముయొక్క బరువు అధికముగానుండుట నెఱింగి, తన కరదండమును గ్రిందబెట్టి థీసియుసు మీాద గలియబడెను. తన సత్వము కొలది బాలవీరుని గొండదాట నెగురవేయవలయునని ప్రయత్నముసేసెను. కాని థీసియుసు కుస్తీపట్లను నేర్చిన వస్తాదగుటచే, దనలోహదండమును గ్రింద బెట్టి, సైరనుపైబడి, కంఠము నొకచేతను మోకాలి నొక చేతనుబట్టి, రాళ్ళ కట్టకానించి, యూపిరి సన్నగిల్లునంతవఱకు నొక్కెను. సైరను అప్పుడు ఎగరొప్పుచు "అయ్యా! నన్ను విడిచిపెట్టుము. నిన్నుబోనిత్తును" అని బ్రతిమాలెను. థీసియుసు నిష్కరుణుడై, "కఠినాధ్వము సరళమైనంతదనుక నిన్ను విడువరాదని యతని నారాళ్ళగుట్టకుబెట్టి గట్టిగాఘట్టించెను. రాళ్ళగుట్టకూలిపోయెను. సైరను నేలకు గ్రుంగిపోయెను. అతనిమేనెల్ల గాయములయ్యెను. సత్వముడిగిపోయెను.

అత్తఱి నాయైత్రకుమారుడు ఆదురాత్ముని లేవనెత్తి "రమ్ము. ఇప్పుడు నాపాదములను గడుగు"మని యాదేశించెను. మఱియు దనలోహపు గటారిని చేతం బుచ్చుకొని, దగ్గఱనున్న బావిగట్టునం గూరుచుండి, "నాపాదములను జలములో గడుగుము," లేనియెడల నిన్నీఖడ్గముతో దుత్తునియలుగా గోసెదనని వెఱపించెను.

సైరను గజగజ వడంకుచు, వీరకుమారునకు బదప్రక్షాళనము సేసెను. ఆకార్యక్రమము ముగిసినవెంటనే థీసియుసు,

నిలువబడి "నీవితరులకు జేసినప్రకారముగ నేడు నీకు జరుగ వలయును కావున నీకూర్మమునకు నీవే యాహారముగమ్ము." అని పల్కి యాతని నచ్చటినుండి కొండలమీదుగ సముద్రములో బడునట్లు లీడ్చియొక తన్నుదన్నెను.

ఆపాపి కాయము ఎగిరి గుట్టదాటి సముద్రములో బడెను గాని, యంతటిఘోరపాప భూయిష్ఠమగు కళేబరమును గ్రహింపనొల్లక సముద్రుడు తిరిగి తీరమునకు ద్రోసివైచెను. భూదేవియు నాపాపపూరితశరీరము నంటనొల్లకగూడ దానిని నీరములోనికి ద్రోసెను. కూర్మముసైత యానాఁ డాకలిచే మ్రగ్గెను. సముద్రతరంగము లాకళేబర స్పర్శచే నాగ్రహము నొంది దానిని గాలిలోని కెగురగొట్ట మొదలిడెను. కొంతవడి యిట్టులాకాయము సర్వనిరసనముచే నటునిటు గొట్టుకొని స్వరూపముబాసి, యాతీరమున నొక నిర్గతికమైన మహాశిలగా మాఱి పడియుండుటచే నిప్పటికిని దర్శనీయముగనున్నది.

పాసానియస్ అను ప్రపంచయాత్రికుడు ఏథెన్సు రాజాస్థానమున కెదురుగ, థీసియస్ సైరనుకాయమును సూటిగ సముద్రములోనికి దన్నుచున్నట్లు నిర్మించబడిన యొక మృణ్మయవిగ్రహమును దాను స్వయముగా జూచినట్లు చెప్పుటచే, నీవీరకథాంశము సత్యమని భావింపబడుచున్నది.

పదంపడి యావీర బాహుశాలి, యత్తావునువిడి, యవిరామముగ నొక్కదినము ముందునకు సాగిపోయెను.

థీసియసు మెగారాప్రాంతమును దాటి ఆతిక్ దేశపు సరిహద్దులలో బ్రవేశించెను. ఎల్లవేళల జల్లని మంచుతో

గప్పబడియుండు సితేరాన్ పర్వత శృంగము లతనికి సందృశ్య ములయ్యెను. అందు తమాలాది వృక్షములు నిబిడములై యుండును. మద్యపానాసక్తులైన దేవరూపులును, దేవకన్యక లును నందు తఱుచు విహరించుచుందురు. వారు మానవుల నాటవిక జీవులనుగాజేసి బుద్ధిహీనులుగను స్మృతిహీనులుగను జేతురు. తోవ పొడుగున నతనికి సముద్రము రొదవెట్టు చుండెను.

అట్లొక్కదినము ప్రయాణము సేయువఱకు, థీసియుసు త్రయాసియన్ మైదానముదాటి, యెలూసిస్ నగరమునకు జేరెను. అచ్చట బ్రకాశించు భూమాత దేవాలయము నతడు సందర్శించెను. ఈ దేవాలయమున్న తావుననే తొలుత డెమిటర్ అనబడు భూమాత తనప్రియుడైన టిప్టోలిమస్సును గాంచెను. ఆమెచేతిలో ధాన్యపు కంకులకట్టయుండెను. భూ మాత యతని కచ్చటనే నేలనుదున్ను విధానమును నేర్పెను. కట్టని యావులను నాగటికిగట్టి దున్నించుమార్గమును జెప్పెను. విత్తనములు చల్లుటయు, బంటపైరులను గోసికొనుటయు నేర్పెను. ఈకృషివిధానము నన్నిజాతులవారికిని నేర్ప బంపెను. పాటుసేయు కర్షకుల కందఱికిని ధాన్యమునొసంగు నట్లుచేసెను. అందువలన యులీసిస్ నగరమున సేద్యముసేయు సర్వజనములును నామెను, నామె ప్రియుడై ధాన్యప్రధాన కారకుడైన టిప్టోలిమస్సును నధికముగ గౌరవించుచుందురు.

థీసియస్ సస్యప్రదేశము మీదుగ, యెలూసిస్ నగర మున జేరిన వెనుక నానగరపు సంతవీధిలో నిలువఁబడి

"ఈనగరమున కధిపతియైన కెర్కూవాన్" ప్రభు వెచ్చట నున్నాడు? నేడు నేనతనితోఁ గుస్తీపట్టవలసి యున్నది." అని యెలుగెత్తి కేకవేసెను.

అప్పుడు జనులందఱును నతనిచుట్టును గ్రిమ్ముకొని, "సుందరయువకుడా! మృత్యువు నేటి కాహ్వానించెదవు! మహాక్రూరుడైన నగరాధిపతి. యొక్క క్రొత్తమానవు డీ నగరికి వచ్చియున్న వాడని వినకపూర్వమే, అతిశీఘ్రిముగ నీనగరమును విడిచి తరలిపొమ్మ."అని వాక్రుచ్చిరి.

థీసియసు ప్రజల యధైర్యవాదములను లెక్కసేయక రాజమర్గమున కెదురుగా బోవుచుండెను. కొంద ఱనుకంపా మతులు "అబ్బా! ఈయువకుడు మనోహర కోమలాంగుడు. రాజు నేడితనిని దుదముట్టించును గాబోలు. అని విచారింప దొడంగిరి. కొందఱీతని ధైర్యసాహస సూచకముఖ చిహ్నముల నరసి, నేడు మనరాజు ఈయువకుని చేతిలో గడ తేఱును. మర్త్యలోక భీకరుడగు నీపాపి నేటితో నంత మొందును. లోకు లింక నిర్భయముగ జీవింతురని ధైర్యోక్తుల నాడిరి. వీరపుంగ వుచె రాజసౌధ ముఖద్వారమున నిల్చి తొంగిచూడ, నప్పుడు రాజొంటరిగ భవనమధ్యస్థమగు నొక యాసనము నలంకరించి యుండెను. థీసియసు రాజా! నీవు కుస్తీపట్టుటయందు మొనగాడవని పేరువడసితివి. బయటికివచ్చి నాతో పోరుదువా యని కేకవైచెను.

కెర్కువాన్ ప్రభువీ బాలవీరునిజూచి, క్రొత్తవాడని గ్రహించి మందహాసముసేసి, ఓయీ! నేను కుస్తీకి వచ్చెదను.

నీవు అలసటగొని యున్నట్లు కనుపించుచున్నావు. నాసరసన గూరుచుండి భుజించి యాకలి దీర్చుకొమ్మనెను.

రాజభటులు వివిధరూపాహారమూలను, మ ధు వు ను గైకొనివచ్చి వారిద్రమోల బల్లలపై నిడిరి. ప్రయాణప్రయాస బడసియున్న ధీసియసు ముప్వురు భుజింపగలిగిన యాహార మును భుజించెను. కెర్క్వాన్ ప్రభువు ఏడుగురు మనుష్యులు భుజించునంత యాహారమును భుజించెను. వారొండొరులతో సంభాషణము చేసికొనలేదు. ఒకరినొకరు చూచుకొని నేనే జయించుదునని మానసములయందు నుభయులును భావించిరి. తుదకు కెర్కువాన్ ప్రభువు లేచినిలుచుండి "నేడీరాత్రిపొద్దు పోవకమున్ను మనము కుస్తీపట్టవలయు"నని యాదేశపూర్వక ముగా భాషించెను.

వారుభయులును దమతమ దుస్తులను దొలగించి యొక్క ముగా నుంచుకొని, కుస్తీసమయమున కర్హమైనకొలది వస్త్ర ధారణము మాత్రము గావించిరి. రాజసౌధమున దొడ్డిలోగల కుస్తీరంగస్థలమునకు జేరిరి. కెర్కువాన్ రంగస్థలమున గొత్త యిసుక జల్లునట్లు లేర్పాటుజేసెను. ప్రజలెల్లరు రాజ సౌధ ద్వారములయొద్దికివచ్చి యేమి జరుగునోయని యెదురుచూచు చుండిరి. సాయంసమయమున నారంభించి, రేయిని గగనసీ మను జుక్కలలంకరించువఱకును నవిచ్ఛిన్నముగ బోరాడిరి. దీర్ఘనిశ్వాసముల విడిచిరి. ఒకప్పుడొకరు క్రిందబడిరి. మఱి యొకప్పుడు రెండవవారు క్రిందబడిరి. వారిలో నొక్కరును వెనుకంజ వైవలేదు. తుట్టతుదకు గెర్కువాను ఆగ్రహావిష్టుడై

థీసియసు కంఠమును బట్టుకొని యల్లల నాడించెను గాని, యతని పాదములఁ జలింపజేయలేకపోయెను.

థీసియసు చాల చురుకుగను, జాగ్రత్తగను బోరాడుచు, కెర్కువాను నడుమును బట్టుకొని, యొక్క పెద్దయూపు నూపి, యతని భుజముమీదగా గ్రిందబడునట్లు విసరెను. తరువాత థీసియస్, రాజుమీదికురికి, "లోఁబడుము. కానిచో నిన్ను జంపివైచెద"నని బిగ్గఱగా నఱచెను. కెర్కువాను మాటాడలేదు. పడినపాటుతో నతనిగుండె పగిలిపోయెను.

అప్పుడు థీసియసు సింహద్వారము తలుపులుదెఱచి ప్రజలను లోనికిరావించెను. "నీవు మాదుష్టరాజును జక్కాడితివి. నీకు మాకు బ్రభుడవుగానుండి దేశమును బ్రజలను జక్కగాఁ బరిపాలించుము" అని ప్రజలు థీసియసును వేడుకొనిరి. థీసియసు అందులకు సమ్మతించి, మీాయెలూసిస్ ప్రాంతమునకు బ్రభువుగానుండి న్యాయధర్మములతో బ్రజాపరిపాలనము సేసెదను. ఇందుకొఱకే మీాప్రాంతముననున్న సినిస్, సైరన్, కెర్కువాను లను దుష్టులను సంహరించితినని ప్రత్యుత్తరము సెప్పెను.

ఆ సమయమున నొక వృద్ధుడు ముందఱికివచ్చి, వీరకుమారా! నీవు సైనిసును జంపితినని చెప్పుచున్నావు. సైనిసు ఏథెన్సురాజగు యేజియస్‌కు దగ్గఱబంధువుడు. నీవచ్చటికి బోయినచో, యేజియసు వారినుండి తప్పించుకొనవలసియుండును." అని వాకొనెను.

"అట్లయినచో సైనిసు నాకు బంధువుడు. అతని దౌష్ట్యముసహింపరానిదగుటచే జంపవలసివచ్చినదా. నాబంధు

వును నేనేజంపివేయుట తటస్థించినది. అధర్మదూరుడును లోక దూష్యుడుననుగుటచే నాబంధువని తెలిసికొనజాలక ధర్మాను రాగినై నేనతని దుదముట్టించితిని. ఈహత్యాజనిత పాపము నుండి నన్నెవ్వరు విముక్తుని జేయుదురు? అని థీసియసు ప్రసంగించెను.

అంతనావృద్ధుడు, "సెఫీసస్ రజత వాహినీతీరమునగల యఫిడ్నామ్ ప్రాంతమున మహావృక్షముల నీడల నివసించు పైటాలస్ కుమారులగు మహావీరులు నీపాపములను దొలగించగలరు. వారు దేవతాగణముల రహస్యముల నెఱుంగుదురు. నీవచ్చటికి బోయి పవిత్రుడవై రమ్ము. అప్పుడు నీవు మాకు రాజువు కాగలవనిపల్కెను.

ఈవిధమున థీసియసు మెరీయస్ ప్రజలవలన "దన్ను రాజుగా నంగీకరించి నీయాజ్ఞలకు లోబడియుందు"మని వాగ్దానము గైకొని, మఱునాటియుదయమున బయనము సాగించెను. త్రియూసియన్ మైదానముమీదుగాబోయి, యతడచ్చటి కొండలపై ప్రయాణముసేసి పిటాలస్ కుమారులగు వీర పురుషులకొఱకు అఫిడ్నాయ్ ప్రదేశమునకు జేరుకొనెను.

పార్నెస్ మహీధరము మూలప్రదేశమున నడుచుచు నెఫిసస్ లోయచుట్టుదిరిగి వచ్చుసమయమున, థీసియస్ వద్దకు నమూల్యాంబరములధరించిన యొకయాజానుబాహువైన సత్వశాలివచ్చి కలిసెను. అతనిహస్తములయందు స్వర్ణకంకణములును, మెడయందు రత్నఖచిత కంఠాభరణమును విరాజిల్లుచుండెను. అతడు వినయపూర్వకముగా థీసియస్‌కు నమస్క-

రించి, చేతులుముకుళించి యిట్లనెను. "పర్వతప్రాంతమునకు వచ్చిన యోసుకుమారశరీరా, సుందరగాత్రా నీకుస్వాగతము. సజ్జనునకు నతిథిపూజనముకంటె నధికమైన సంతోషము గలుగజేయునదేమి? నేడునీదర్శనము నాకానందదాయక మైనది. కాని నీవుశ్రమచే నలంతజెంది నట్లగపడుచున్నావు. నాదుర్గమునకువచ్చి యించుకతడవు సేదదీర్చికొనుము."

"అయ్యా నీకనేకవందనములు. నేనీకనుమల్ల దాటి అథిడ్నాయ్‌సీమను శీఘ్రముగ జేరవలయునను కుతూహల ముతో నున్నాను.

"అయ్యోనీవు త్రోవతప్పి చాలాదూరము తిరిగినావు. నీవు నేటిరాత్రికి అథిడ్నాయికి బోజాలవు. ఇచ్చటికి అథిడ్నాయి పలుమైళ్ళదూరములోనున్నది. మధ్యరంగమంతయు పర్వతప్రాంతము. చాల నిమ్నోన్నతప్రదేశము. ప్రొద్దు గ్రుంకినతరువాత నాటిరాతినేల బయనించుట ప్రమాదకరము. నేను నిన్నుగలియుటయే మంచిదైనది. నూతనాతిథులను గలి యుటయు, వారికి సపర్యలుసేయుటయు, వారివలన నాయా దేశముల కథావిశేషములను వినుటయు నాకత్యంతానంద దాయకమైన విషయము, నాతోడరమ్ము. నాదుర్గమున విందు నారగింపుము. ప్రశస్తికెక్కిన నాకోమలశయ్యయందు నిదురిం పుము. దీనినిజూచిన పాంథులెల్లరును నిదియసదృశమని వాకొ నిరి. నాయతిథి యెంతపొడవున్నను నెంతపొట్టిగనున్నను, నతని మూర్తికనుకూలముగ నాసజ్జ పెరుగుచు దఱుగుచుండ గలదు. నీవుదానిపైన నపూర్వమైన నిద్రాసౌఖ్యము ననుభ

వింటువు." అనివాక్రుచ్చి యాస్థానికరాజపురుషుడు థీసియసు చేతులుపట్టుకొని, యిందుండ బలాత్కారముచేసెను.

థీసియసు ప్రయాణమునే సాగింపగోరెనుగాని యంత గౌరవముతో నాతిథ్యము నీయవచ్చినవానియెడల నసభ్యముగా సంచరించుట యుచితముగాదని భావించెను. అదియునుంగాక యంతఆశ్చర్యకరమైన సెజ్జ యెట్లుండునో చూడవలయు ననుకొనెను. ఆకలిగొనియుండెను. అలసట చెందియుండెను. ఆపర్వతనివాసి కంఠస్వరము నెమ్మదిగను నిచ్చకముగను నున్నను మాధుర్యశూన్యముగ నుండెను. అతని కన్నులు అచంచలములై శాంతములుగ నగపడినను, నవి రాళ్ళవలె గళాశూన్యముగను నిర్జీవములుగను నుండెను.

అయినను థీసియసు వానినాతిథ్యమున కంగీకరించెను. వానివెంబడి కొండకోనలోనికి బోవసాగెను. ఆకొండకోన థీసియసును బాటతప్పించి, పార్నెస్ పర్వతాగ్రములవద్దికి దీసికొని పోవుచుండెను. పోవపోవ నాకొండకోన సన్నగిల్లెను. రాతిగుట్టలంతకంత కధికోన్నతప్రదేశమునకు ద్రోవదీయుచుండెను. దానిక్రింద నొకప్రవాహము ఘూర్ణిల్లుచుండెను. ప్రాంతమంధకారమయమగుచుండెను. ఆగుట్టలచుట్టు నొక వృక్షముగాని ఆకులపొదలుగాని గానరావయ్యె. పార్నెస్ పర్వతాగ్రములనుండి మంచుగడ్డలచ్చటికి రాలుచుండెను. ఆభయంకరస్థానమును గొంతవడి పరికింపగా, థీసియసు చిత్తమనుమాస్పదమగుచుండెను. తుట్టతుదకు థీసియస్ యాహ్వానకర్తనుజూచి "నీదుర్గము నిస్సారమైన ప్రాంతములో నున్నట్టు లగపడుచున్నదనెను.

"బాలకా! ఆతిథ్యమీ ప్రాంతమును సజీవము సేయు చున్న"దని ఆసమయమున కనుకూలముగ బ్రసంగించెను. అప్పుడువారు వెనుకకుదిరిగిచూడగా, కడుదవ్వున గ్రిందిభాగమున, వారువిడిచివచ్చిన బాటవెంట బరువుమోయు గార్ధభములు గానవచ్చెను. వాటివెంట బరువులను భద్రముగా నుండ జూచుకొనుచు ప్రక్క-ప్రక్కగా నడచుచున్న వర్తకులును గానవచ్చెను. అంతనామాయావి, "అన్నా! ఒక్కనాడు నాదుర్గమునకింతమంది యతిథులువచ్చుట నాభాగ్యము నేనుక్రిందికిబోయి వారిని బిల్చుకొనివచ్చెదను. మనమందఱము గలిసియే భుజించవచ్చును. నేను మగుడివచ్చునంతవఱకు నీవిక్కడనేయుండు"మని థీసియసుకుజెప్పెను. అట్టులతడు క్రిందికిబోయెను. థీసియసు కొండపైత్రోవ యల్లనల్లన బోవుచుండెను.

థీసియస్ కొంతదూర మట్టులున్నత ప్రాంతాభిముఖుడై పోయిన, నందొక ముదుసలి, సెలయేటిలో గొట్టుకొనిపోవు పుల్లల నేరుకొనుచు నాతని కన్నులకగపడెను. అతడు తన కట్టెలమోపును నేలపైనుంచి తిరిగి తలపైన నెత్తుకొనుటకు శ్రమచేయుచుండెను. అతడు థీసియసును జూచి "కుమారా! పెద్దవయస్సువాడ నగుటచే శరీరపాటవము తగ్గినది. మోపు నెత్తికొనలేకయున్నాను. కొంచెము సాయపడుమ"ని యడిగెను. థీసియస్ వృద్ధునియొద్దకుబోయి తోడుపడెను. ఆసమయమున నాముదుసలి థీసియసుకు శుభవాదముజెప్పి, తేటిపాఱచూచి నాయనా నీవెవ్వరవు? ఈభయంకరమైన బాటవెంట నొక్కడవు ఎందులకు బ్రయాణము చేయుచున్నావు?

అని యడిగెను. అందులకు థీసియసు, నేనెవ్వరనో నాతలి దండ్రులకే తెలియును. నేనొక బలశాలిచే నాహ్వానము చేయబడినాను. నేడు నాకతడు విందుసేయును. అతనియొద్దగల విచిత్రశయ్యపై శయనింపఁజేయును.

అప్పుడా వృద్ధుడు విభ్రాంతిచెంది అయ్యో! వాడు మనుష్యులను దినువాడు. బాబూ నిన్ను వాడు వధించి భుజించుట కాహ్వానము చేసినాడు. నిన్నతడు యమబాధలు పెట్టును. చోరుడు దోవలు దోచుకొనువాడు. ఏబాటసారి కలిసినను వానికి బ్రియోక్తులుసెప్పి యమలోక సదృశమైన తననివాసమునకు దీసికొనిపోయి హింసించును. వాడు చెప్పిన మంచము విచిత్రహింసాభూయిష్ఠమైనది. దానిపై బండిన మానవులలో నేనొక్కఁడునుగాక మఱియెవ్వడును దిరిగి సజీవుడై లేచియుండ లేదు.

థీసియసు వాని వాక్యమున నాశ్చర్యపడి, ఎందువలన నని తిరిగి ప్రశ్నించెను.

"ఏలయన ? నామంచముపై బండువాడు మంచమున కంటెఁ బొడుగైనచో, నతడాతని యవయవములను దగ్గఱకు నొక్కి బాధించి మంచము పొడవునకు మనుష్యుని పొడవు సరిపోవునట్లు చేయును. పండుకొననున్నవాడు పొట్టిగా నగ పడినచో నాచోరుడు వాని యవయవములను బలాత్కార ముగా బట్టిలాగి వానిమేనుపొడుగగునట్లు చేయును. వాడు చెప్పినవన్నియు దొంగమాటలు నాశరీమామంచము కొలతకు సరిపోయియుండుటచే నతడు నన్ను హింసింపలేదు. అప్పుడు నన్ను జంపక బ్రతుకనిచ్చి వానిసేవకుని గా జేసికొనెను.

నేనొక గొప్పధనికుడనైన పరాక్రమకుడనై యుంటిని. థెబిస్‌నగర నివాసిని. అట్టి నేను నేడా మానవహంతకునకు బానిసనై వానికొఱకు కట్టెలుకొట్టి మోయుచున్నాను, నీళ్లు చేది చేరబోయుచున్నాను." అని యావృద్ధుడు వివరించి చెప్పెను.

థీసియసు తద్వృత్తాంత శ్రవణమున నాగ్రహము చెంది, పండ్లు పటపట గొఱికి నిరుత్తరుడై నిల్చెను. క్రమ్మఱ నావృద్ధుడిట్లు వాక్రుచ్చెను. "నీవు తప్పుకొనిపొమ్ము. నీలేత వయస్సు నందతనికి కనికరములేదు. నిన్నటిదినమునసే, యతడొక యువకుని యువతిని నిచ్చటికి దీసికొనివచ్చెను. సెజ్జకు సరిపడునట్లు చేయుటకు యువకుని కాలుసేతులు నఱకెను. ఆయువతీమణి పొడవు చాలకపోవుటచే కాలుసేతులు పట్టి గుంజి, యామె ప్రాణములు దీసెను. ఇట్లువారిరువురును ఘోరమృత్యువునకు గుఱియైరి. చచ్చినవారి కొఱకేడ్చి యేడ్చి నేను వేసటచెందినాను. అతనిపేరు డమెస్థసు. ఈదురంత కృత్యము ననుసరించి యతనిని ప్రొక్రిస్టస్ అందురు. ఆలసింపక యాతనినుండి తప్పికొని పఱుగెత్తికొని పొమ్ము. కాని యెక్కడికి పాఱిపోయెదవు ? ఈరాళ్ళు నిట్టనిలువుగా మిగులనెత్తైయున్నవి. వాటినెక్కుటకు దారులు లేవు. వేఱొక మార్గమును లేదు.

థీసియస్ ఆముసలివానిని మాఱుమాటాడనీయక, యతనిని శాంతింపజేసెను. పాఱిపోవ నవసరము లేదని చెప్పెను. పదంపడి నాబాట వెంట నతడు ముందుముబోవ

సాగెను. అంతనాముదుసలి "కుమారా నేనునీకిట్లు తెలిపితి
నని యాతనితోఁ జెప్పుము. అట్లు చెప్పితివేని యతడునన్ను
చిత్రవధచేయును. అని థీసియసును బ్రతిమాలుకొనెను.

అప్పుడు థీసియసు "ఇదియధర్మపరిపాలనముగల ప్రదే
శము. ఈప్రదేశమునందలి పెనుభూతములను నేనెన్నఁడంత
మొందితు ?"నని యాత్మలోభావించుచుండెను. అట్టిశేకి వర్త
కులను వెంటబెట్టుకొని వారితో సంతోషపూర్వకముగా
ముచ్చటలాడుచు, ప్రోక్రిస్టసు అచ్చటికివచ్చెను. అతడు
థీసియసును జూడగనే ఓహో! నాచిన్నయతిథీ! నాకొఱకు
నిన్ను జిరకాలము నిరీక్షింపజేసితినా"యని ప్రసంగించెను.

థీసియసు, "తనయతిథులను దనసెజ్జపై బరుండఁబెట్టి
కాలుసేతులు సాగదీయునట్టియు, కాలుసేతులు గోసివేయు
నట్టియు, మానవునకు భూమియందు ధర్మసంస్థాపనసేయు సమ
యమున నేమి శిక్ష యొసంగవలయును ? అని బదులుప్రశ్నము
సేసెను.

అప్పుడు ప్రోక్రిస్టసు ముఖవర్చస్సు మాఱిపోయెను.
గవదలు, చిఱుతపులి గవదలవలె వచ్చఁబాఱెను. యతడు
వెంటనే తన ఖడ్గమును జేపట్టెను. కాని థీసియసు అతిశీఘ్ర
ముగ వానిపై కుఱికి. "నన్నాహ్వానము సేసిన యోధాతా!
నేనుజెప్పిన యీయంశము నిజమా, లేక యిందేమైన నసత్య
మున్నదా ?"యని యడిగెను. మఱియు దటాలున నతని
నడుమును మోచేతులను గలిపి పట్టుకొనెను. ఆపాపి ఖడ్గము

పై కె త్తలేకపోయెను. "ఇది నిజమా, అసత్యమా"యను ప్రశ్న మున కుత్తరముగ నతడొక్కమాటయు జెప్పజాలకపోయెను.

అంత థీసియసు వానిని దూరమునకు విసిరి, తనమహా శస్త్రమును దీసికొని, శాత్రవుడు శస్త్రప్రయోగము సేయుటకు బూర్వమేయతని శీర్షమున నొకదెబ్బవైచి, నేలవ్రాల జేసెను. మఱియు నతనిపై థీసియసు మఱొకదెబ్బగొట్టెను. ఆదురాత్ముడు నేలగూలెను.

పదంపడి థీసియసు అతని మేనగల బంగారు తొడవులను సంగ్రహించి యతని గీముసకు బోయెను. అచ్చటనతడు పాంథులను గొట్టి దోచుకొనిన ధన మపారముగ నుండెను. ప్రోక్రిస్టీసువలన నష్టపడిన దేశప్రజల నెల్లరను బిలిపించి యాధనమునెల్ల వారిలో బంచియిచ్చి, కొండదిగి తన ప్రయాణము సాగించెను.

మంచును మేఘములను, వర్షమును లెక్కసేయక పార్నిసు కొండల లోయలలోనుండి యల్లనల్లన బయనము సేసి, సెఫిసస్ లోయలోనికివచ్చి, దానిందాటి, ఫిటాలిడ్ వీరుల యావాసస్థానమైన అథీన్సుయను మనోజ్ఞనగరమునకు జేరెను. ఆవీరు లందొక మహావృక్షముక్రింద నివసించుచుండిరి. అంతవారొక బలిపీఠమును నిర్మించియుండిరి. సెఫిసస్ నదిలో స్నానముచేసి యొకసంవత్సరము వయస్సుగల యొక గొఱ్ఱపోతు పిల్లను బలిగా నర్పింపుమని చెప్పి, యట్లొనరింపబడిన పిదప థీసియసును సైనిస్ రక్తస్పర్శవలన గలిగిన పాపము నుండి విముక్తుని జేసి, శాంతియుతముగా బంపివేసిరి.

పిమ్మట నావీరోత్తంసుడు, ఆలోచనలోనుండి, అఖర్నాయ్ నగరము ప్రక్కగా ముందునకు నడచు, రజతవాహిని బొంటె ప్రయాణముసేసెను. థీసియస్ విక్రమకీర్తి నలుదెసల వ్యాపించి యుండుటచే బ్రజలాతనినాశీర్వదింప సాగిరి. కడకు నావీరపురుషుడు ఏథెన్సుమైదానమును నా పొంత, నేశ్వర నివసించు మహీధరమును జూడగల్గెను. ఏథెన్సుప్రాంతములో థీసియస్ ప్రయాణముజేయు సమయమున, నతనిచిత్తము వ్యాకులతజెందియుండెను. అతడు తండ్రిని జూడవలెనని కాంక్షించుచుండెను. "నాతండ్రి రక్తమును ద్రావు దుష్టగ్రహముల నుండి యతని నెట్లు విడిపించ గలుగుదు"నను విచారమతనిని మిగులబాధించుచుండెను.

ఇట్టి విచారముతో థీసియస్ ఏజియస్ నివసించు రాజసౌధమునకుజేరి యారాజుండు భవనభాగము యొక్క ద్వారముకడ నిల్చి లోనికి దొంగిచూచెను. అయ్యదనున నేజియస్ప్రభువు అంతర్మందిరముననుండెను. ఆ ముఖభవనమున పల్లాస్సంతానమగు రాజకుమారులు మాత్రమందు వరుసగా గూరుచుండి నవ్వుకొనుచు, మధుపానము సేయుచు నితరభోజ్యపదార్థముల నారగించుచు వినోదముగ గాలయాపనము సేయుచుండిరి. దాసకన్యకలు గాయనముల బాడుచుండిరి. గారడివాండ్రు వినోదముల జూపుచుండిరి. వారిని జూచి వారు తన సవతితల్లికుమారులని గ్రహించి థీసియసు, ఇట్టి వివేక శూన్యులు రాజ్యాంగము నడుపుచుండునప్పుడు, రాజ్యము దోపిడిగాండ్ర కాకరమైన దనుట యాశర్చముగాదను"కొనెను. పాలంటీసు లతనింజూచి "ఓయీ! నీవు

మావిందు సమయమునకు వచ్చితివి." అని ప్రశ్నించిరి.

థీసి—"నేను ఆతిథ్యము నర్థించుటకు వచ్చినాను"

"అట్లయినరమ్ము. నీవొక వీరపురుషునివలెను, ధైర్య సాహసములుగల యుద్ధయోధునివలెను నగపడుచున్నావు. నీవంటివాని కాతిథ్యము నొసంగుట మాకు సంతోషకరమైన విషయము."

"నేను మీయాతిథ్యము నర్థించుటలేదు. ఈరాజసౌధమున కధికారియు, నీదేశమున కధిపతియునగు ఏపియస్ రాజు నాతిథ్యము నడుగుటకువచ్చి యున్నాను."

ఈప్రత్యుత్తరము నాలకించి కొందఱు రాజకుమారులు నవ్విరి. కొందఱు కేకలువైచిరి. కొందఱు హుంకారముల గొట్టిరి. మఱికొందఱు "ఇచ్చట మేమందరము యజమానులమే యనిరి.

"అట్లయినచో మీయందఱివలె నేనును నొకయజమానినే"యని భవనమధ్యగతమైన విందుబల్లయొద్దికిబోయి, ఏజియస్ కొఱకు నలుదిక్కుల నరసెను. కాని ఏజియస్ ఆభవన భాగమున నతని కగపడలేదు.

పాలంటీడు లతనివంకఁ దీర్ఘాలోకనము జేసిరి. తరువాత నొకరికొకరు మొగము జూచుకొనిరి. "అబ్బా! ఇతడు సాహసికుడుగా నున్నాడు. వీనిని దూరముగా వెడలింపవలయునని యొకరితోనొకరు రహస్యముగా జెప్పసాగిరి. "ఇతని బాహువు లతి దీర్ఘములై యున్నవి. నీవేలేచి వానిని బయటికి దఱుము

మనియొకొక్కడు రెండవవానితో జెప్పనేగాని యొక్కడును నతనిని బంపివేయ సాహసించినవాడు లేకయ్యెను.

అంత థీసియసు స్వయముగా సేవకులను బిలిచి "మీరు ఏజియస్ ప్రభువునొద్దకుబోయి, ట్రోజీనునుండి థీసియస్ వచ్చినాఁడనియు, నతడు మీయాతిథ్యము నించుకతడవు గోరుచున్నవాడనియుఁ జెప్పుడని ఆదేశించెను. ఆసమయమున ఏజియస్ ప్రభువు మీడియాయను మాంత్రికురాలిప్రక్కదనమందిరముననే గూర్చుండి యుండెను. ఒక సేవకుడతని యొద్దకుబోయి, ట్రోజీన్ నుండి థీసియసు వచ్చినాడని వినిన క్షణముననే యతని ముఖము కళాహీనమయ్యెను. చూపుల తళుకు మందమయ్యెను. తనసుఖాసనమునుండి, గజగజనడంకుచు లేచి బయలుదేర బోయెను. అట్టితటి "మీడియా" మాంత్రికురాలు, అతని నడవడి గమనించి "ట్రోజీనుతో నీకు సంబంధమేమి ? యని యడిగెను. ఏజియసు సంభ్రమముతో, నిట్లనెను. "థీసియస్ ఎవ్వరో నీకు తెలియదా ! మన దేశమున నున్న పెనుభూతములను, మానవాదులను, దుదముట్టించిన మహావీరుడు. అతడు ట్రోజీనునుండి వచ్చినాడని నాకుదెలియదు. నేను వెలుపలికిబోయి యతనికి స్వాగత మొసంగవలయును."

పదంపడి ఏజియస్ అతిథ్య భవనములోనికి వచ్చి, థీసియస్‌ను జూచెను. థీసియసుకు జనకసందర్శనమున, మానసము పొంగెను. జనకుడును వీరకుమారావలోకనమున నానందపరవశుడై యతనిని గౌగిలించుకొని స్వాగతవాక్యముల జెప్ప

నభిలషించెను. కాని థీసియసు "నాజనకుడు నాయందు ప్రేమా తిశయముజూపునో చూపడో" యని సంశయించెను. మఱియు, నేను నానిజవృత్తాంతమును విశదపఱచుటకు బూర్వమున జనకుని చిత్తమెట్లున్నదో పరికించెదనుగాక యని యతడు నిశ్చయించుకొని జనకుని మ్రోల వినమితశీర్షుడై "మహారాజులైన నీరాజ్యమునగల ఘోరదుష్ట స్వరూపులను, మానవాంతకులను జక్కాడినాను. అందువలన మహారాజువగు నీనుండి బహుమతి పొందవలయునని వచ్చినా"నని వాక్రుచ్చెను.

వృద్ధుడగు నేజియస్ రాజు థీసియస్ వంక నత్యంత ప్రేమార్ద్ర వీక్షణముల నీక్షించి, యొక్కనిట్టూర్పువిడిచి,

"ప్రసంశనీయబాలకా! నేనేమి యొసంగినను నీ మహాకార్యములకు సరియైన బహుమతి కాజాలదు. నీవు సాధించిన మహాకార్యముల దృష్టిచే నేనేమి యొసంగినను నపర్యాప్తమనియే తోచుచున్నది. నీవు సామాన్యమర్త్యుడవుకావు. అట్లుగాకున్నను, నీవు సామాన్య మర్త్యాంశమున జన్మించిన వాడవు కావని ప్రసంగించెను. థీసియసు జనకుని భావేంగితము నెఱింగి, రాజా! నిన్ను నే నసామాన్యమైన సత్కారము నభిలషించుటలేదు. నీయాతిథ్య పీఠమున నీపజ్జ నుపహారముకు స్వీకరించుట కనుమతి యీయవలయునని మాత్రము కోరుచున్నానని ప్రత్యుత్తరము చెప్పెను.

అథమపక్షము నేను నానాభవనమునకు నిర్నిరుద్ధయజమానినైనచో నంతమాత్రము నీకొసంగుట కభ్యంతరము లేదని జనకుడు ముచ్చటించెను. తత్సమయ పరిస్థితులలో

రాజు నానతుల కవరోధను గల్పించెడు నంశములుండియుండ వచ్చునని యతని వాగ్ధోరణినిబట్టి కుమారుడు గ్రహించెను.

రాజు తద్వీరకుమారున కుచితాసనము నాయాతిథ్య భవనమున నేర్పాటు చేయించెను. నవరస భరితములైన భోజ్యపదార్థముల నిండిన పైడి పళ్ళెరము నావీరుని ముందల బెట్టించెను. థీసియసు అచ్చటి రాకొమరుల కచ్చెరువు గలిగించునంత పదార్థము నతివేగమున నారగించెను. కాని పరేంగిత జ్ఞానియగు థీసియసు, తన లోహదండమును మాత్రము తనపజ్జనుంచుకొనుట విస్మరించలేదు.

తమోముఖియగు మాంత్రికురాలు మేదియా యతని చర్యను సర్వమును నవలోకించుచునే యుండెను, ఆపె వీర కుమారుడు ట్రోజీనునుండి వచ్చితినని చెప్పినప్పుడు రాజువిని ముఖతేజము నెట్లు గోల్పోయెనో గమనించెను. కుమారుని పట్ల ఏజియస్ హృదయ మెంత శీఘ్రముగ వికసించెనో గ్రహించెను. మిగిలిన రాజకుమారుల ముందల గూర్చున్న థీసియస్ అల్పమృగముల మధ్య సింగముపలె రాజిల్లుచున్న చందము నవలోకించెను.

ఈ వీరకుమారుడిచ్చట సర్వాధికారి కాగలడనియు నితడు ఏజియస్‌కు సన్నిహితుడనియు, పాలంటీసులకు అతని ప్రక్కనెట్టి ప్రాముఖ్యమును మిగులనేరదనియు నాకుటిలవర్తని భావించెను. తనగదిలోని కల్లనల్లనబోయి, కూర్చుండి, దాస దాసీజనులెల్లరు నాతనినిగురించి యేమిచెప్పుకొనుచుండిరో గమనించుచుండెను. "ఇతడు క్రూరహంతకులను బరిమార్చిన

వాడనియు, అతని గంభీరాకృతి యెట్లున్నదో చూడుడనియు, అతసద్దృష్టిప్రసార మెంత ఘనముగనున్నదో తిలకించుడనియు, ఆహా ! ఇతడేమనయజమాని కుమారుడైనచో నెంతయానంద కరముగ నుండునోగదాయనియు" దాసదాసీజను లొకరితో నొకరు జెప్పుకొని గుసగుసలాడుట నాలకించెను. థీసియసు గూడ, నాభవనమున నేవ్యక్తి యెట్లుసంచరించుచున్నదో పరికించుచునే యుండెను. అతడు భోజ్యములనారగించి పానీ యమును గ్రహించు సమయమాసన్నమగుటయు, నా మాంత్రికురాలు మణిఖచిత కాంచనాలంకార భూషితయై, ప్రాచ్యదేశీయ కాంచనాంబర ధారిణియై, అత్యంత సుందరా కారిణియై, సభాజనదృష్టి సమాకర్షణశాలినియై, వామహస్త మున నొక్కపైడిపాత్రియు, దక్షిణహస్తమున నొకపైడి గిన్నెయు నుంచుకొని, వీర లోకాగ్రేసరుడును బరేంగిత జ్ఞానియునగు థీసియస్ వద్దకువచ్చి, కోమలములై మధురము లైన పలుకులతో నొయ్యారముమీఱ నిట్లుభాషించెను.

"వీరపురుషోత్తమా ! నీకు జయంబగుగాత; నీవుజేతవు. అవినిర్జితుడవు. దుష్టశక్తివిభంజన సమర్థుడవు. ఈ నాపైడి గిన్నియలోని మనోరంజక మధురపానీయమును ద్రావుము. ఇదినీకు శ్రమానంతరమునగల్గు నలసతనుదీర్చును. మేనిగాయ ములమాన్పును. నీనరములలో క్రొత్తజీవమును బోయును. ఇది ప్రాచ్యదేశీయ మధుబిందువులతో గలిసియున్నది. ఇమ్మైది యమర్త్యులకునైతము మనసౌఖ్యము నిచ్చునది."

ఇట్లు వాకొనుచు నామె తనయెడమచేతిలోని పాత్రయందుగల పానీయమును కుడిచేతనున్న బంగారుగిన్నెలోఁ బోసెను.

థీసియసు, ఆమాంత్రికురాలి సుందరముఖారవిందమును గాఢాంధకార నీలిమకాకరములైన కన్నులచూపులనుజూచి, మానసోత్సాహమును గోలుపోయి భయపరివృతుండయ్యెను. ఆమెకన్నులు రసహీనములై, విషచ్ఛాయల గ్రక్కుచుండెను.

"నీపైడిగిన్నియలోని మధురసము పరిమళవంతమైనది. నీవు దేవకన్యవలె సుందరాకారిణివి. కావున నీరసము తొలుదొల్త నీయాస్యరంగమును రంజింపజేసి నాకొసంగితివేని, దానికధికమైన నవరుచి యుదయించును." అని థీసియస్ మాంత్రికురాలితో ననెను. మేదియా తెల్లమొగమువైచి, మాటగొణుగువడ "వీరపురుషా! క్షమింపుము. నేననారోగ్యముగ నున్నాను. మధురసములుద్రావ సాహసింపజాలనని మాఱుపల్కెను. అప్పుడాయువజను డామెకన్నులవంక తేఱిచూచి, "నీవీమధురసమును ద్రాగిచూపవలయును. కాదేని నిన్నిచ్చటనే తుత్తునియలు సేసిపై చెదనని గద్దించెను. సభ్యులెల్లరును భయకంపితులై చూచుచుండిరి. మేదియా పెద్దకేకపెట్టి, తనచేతిలోని బంగారుగిన్నెను నేలపై విసరివైచి, వెనుకకుదిరిగి పఱువెత్తెను. ఆగిన్నెలోనిద్రవము ఱాతిపై బడెను. ఱాయి తుత్తునియలై పొంగి, బూడిదయై విపరీతనినాదముతో బుడగల వెడలగ్రక్కెను.

మాంత్రికురాలు వెంటనే తన శకటమును బిలిపించు

కొని, యందారోహించి, బయనించి, వనాంతరములదాటి సముద్రములను దరించి, నిర్జన ప్రదేశమునకు బాఱిపోయెను. అప్పటికిని నిప్పటికిని నామె మనుష్యమాత్రున కగపడలేదు. ఏజియసు "మాంత్రికురాలి నేమిచేసితివని కుమారుని బ్రశ్నించెను. థీసియసు తండ్రికా రాత్రిపై జరిగినచర్యను విశదముగా జూపించెను. రాజా నీరాజ్యమును మాంత్రికాపాయమునుండి దూరము సేసితిని. మఱియొక నివార్యాంశమున్నది! యని బదులుసెప్పెను.

అంతనతడు తన నడుమునుండి శస్త్రమునుదీసి, పాకోళ్ళను బయటఁబెట్టి, తనతల్లిచెప్పిన వాక్యములను ఏజియస్ ప్రభువునకు వినిపించెను. ఏజియస్ ప్రభువప్పు డాయువకుని గౌగిలించుకొని విచారించి కన్నీటిబిందువులరాల్చెను. నా కుమారుని జూడుడని యందఱికి జూపించెను.

పాలంటీడులందఱును నీర్ష్యాగ్రస్తులైరి. ఈక్రొత్తవాని నెట్లువదలించుకొనవలయునను నాలోచనచే నందఱికిని బిచ్చిపట్టినట్లయ్యెను. తలకొకరీతిగా గేకలువేసిరి. భవనకుడ్యముల వ్రేలాడుచున్న శస్త్రములదీసికొని యందఱును నొక్కుమ్మడిగా థీసియస్‌తోఁబోర నుద్యమించిరి. థీసియస్ తనయాయుధములబట్టి పోరసంసిద్ధుడయ్యెను.

"అన్నలారా! మీఅందఱును నల్లరిసేయక మిన్నకుండుడు. లేనిచో మీరెల్లరును మిత్తివాతఁబడుదురు." అని థీసియస్ వారికి దొలుత మంచిమాటలతోఁ జెప్పెను. కాని వారిఈర్ష్యాగ్ని వారిహృదయముల గ్రమ్ముకొనియుండుటచే

శాంతిభావము వారికిస్ఫురింపలేదు. భయంకరమైన సింహాము మీాదికి గుక్కలవలెనెగబడిరి. కానియొక్కడును నాయాజాను బాహువును జేరలేక, తమయాయుధములను వానిపై పునపు విసరివైచిరి. ఆయుధమొక్కటి థీసియసుతలప్రక్కగా దూసుకొనిపోయెను. ఆయుధహస్తులందఱును నిరాయుధులైరి. థీసియస్ అప్పుడిక శాంతిమార్గముతోను ప్రయోజనములేదని వారితో బోరనారంభించెను. ఒక్కనికెదురుగ నిరువదిమంది నిల్చిరి. అందఱిని థీసియస్ పదినిమిషములలో క్షతగాత్రులను జేసెను. కొందఱు భవనమువెడలి పాఱిపోయి నగరములో వర్తకులయిండ్ల శరణుజొచ్చిరి. నగరమునందంతటను నీయుద్ధవార్త వ్యాపించెను. సూర్యుడస్తమించుటకుముందే పాలంటీడులందఱును వీరసింహాము నెదురజాలక పాఱిపోయిరి. ఏజియస్ప్రభువును థీసియస్మాత్రమే రాజభవనమునమిగిలిరి. ప్రజలు దుష్టసంహారమునకు సంతసించి, థీసియసు ప్రభుత్వము నంగీకరించి, యుపాయనముల నర్పించిరి. ఏజియస్ రాజసౌధమును నూతనశోభ యలంకరించెను.

వీరకుమారుడు నిజజనకున కానందదాయకుడై తదిచ్ఛాను సారముగా చలికాలమంతయు నతనియొద్దనే గడపెను. వసంతకాలము పొడసూపెను. ఎథీనా నగరవాసు లెల్లరి ముఖములయందును విచార చిహ్నము లావరించెను. నగరమంతయు విలాసశూన్యమై నిశ్శబ్దమైయుండెను. ఏగృహాద్వారమునను బచ్చని తోరణము లేదయ్యెను. థీసియస్ ప్రజల సమీాపించి యీావిచార పరిస్థితికి గారణమేమని ప్రశ్నించెను. కాని యొక్కడును ప్రత్యుత్తర మొసంగడయ్యెను.

అంతియగాక తలవంచుకొని రోదనము సేయసాగెను. అంత థీసియస్ జనకునిజేరి నగరమునంతయు నింత విచార గ్రస్తమై యుండుటకుఁ గారణమేమని యడిగెను. ఏజియసు పెడమొగము వెట్టి దుఃఖించెను. "కుమారా! అనుభవింపక తప్పని విపత్తును గుఱించి యిప్పటినుండియు స్మృతిసేసి విచారము పెంచకుము. విపత్కాలమున నేయనుభవించుచు బొందు విచారమే చాలునని కుమారునకు బదులుసెప్పెను.

వసంతసమయారంభ దినమున, శతనగర సంయుక్తమగు క్రీటుద్వీపమునకుఁ బ్రభువైన మీనాసు యొక్క సేవకుడొకడు, ఏథెన్ నగరమున ముఖ్యవీధిలో బ్రముఖస్థానమున నిలువబడి, "ఏథెన్సు ప్రజలారా, ఏథెన్సు నగరాధిపా; మీరు ప్రతి సంవత్సరమును జెల్లించు నుపాయన మింకను బంపలేదేమి ?" యని యొక కేకవైచెను. దానితో నగరమునందంతటను రోదనమధికమయ్యెను. కాని థీసియసు సేవకుని యొద్దకుబోయి, నిలువబడి, నీవెవ్వరవు, ఉపాయన మిమ్మని యడుగునంతటి సాహసమేల పూనుకొనినావు. రాజసేవకుల యందు నాకు గౌరవముగలదు. లేకున్నచో ఈవలెకే యీ దండముతో నీశిర్షమును రెండు చెక్కలుగాజేసెడివాడను." అని పక్కాణించెను.

వృద్ధుడును, స్వామిభక్తుడును నగు నాసేవకుడు సుందర కుమారా! నేను సిగ్గుమాలిన వాడనుగాను సేవాధర్మము ననుసరించి, నాప్రభువైన మీనాస్ రాజు యొక్క యాజ్ఞలను నేను నెఱవేర్చుచుందును. నీవు క్రొత్తవాడవు. కాని యెడల

నేనేల వచ్చితినో నీకు దెలిసియుండెడిది. నాకట్టి యధికారము గలదనియు నీవెఱింగియుండవలసినది." అనియుబదులుపల్కెను.

థీసి—"నేనీస్థానమునకు గ్రొత్తవాడను. అట్లయిన నీవెందులకు వచ్చితివో తెల్పుము."

సే—ఏజియస్ ప్రభువు మాప్రభువగు మీనాస చక్రవర్తికి ప్రమాణపూర్వకముగా చేసిన వాగ్దానము ప్రకారము చెల్లించవలసిన సాంవత్సరికోపాయనము దీసికొని పోవుటకు వచ్చియున్నాను. అట్టి వాగ్దానము ఏలచేయబడినదో చెప్పెదను వినుము. మైనాస ప్రభు డీప్రదేశమును నీభూమికి దూర్పుదెసగా నున్న మెగేరా ప్రాంతమును జయించెను. ఏలయన, మారాజకుమారుడు ఆండ్రోజియాస్ అనునతడు కేళీప్రదర్శనములలో గ్రీసుదేశీయులనెల్ల జయించుటచేఁ బ్రజలెల్ల నతనినొక వీరునిగా గౌరవించిరి. ఏజియస్ రాజు అతని బరాక్రమమును జూచి యతనియం దసూయ గొనెను. పల్లాస్ కుమారులతో గలసి యతడు తన రాజదండమును గుంజుకొను నేమో యని, ఏజియస్ భయపడెను. అందువలన ఏజియస్ రహస్యరీతిని గుట్రబన్ని ఆండ్రోజియాస్ జీవము లపహరించెను. ఎక్కడఁ జంపించెనో ఎట్లు చంపించెనో ఎవ్వరికిని దెలియదు. తెబీస్ ప్రాంతమునకు బోవు త్రోవలో చోరుల నియోగించి చంపించెనని కొందఱుచెప్పుదురు. మెరోథార్ లోని వృషభము నొద్దకుబంపి యాయాటవిక వృషభముచే జపించెనని కొందఱందురు.

ఆండ్రోజియాసు, ఖేలనప్రదర్శనములలో పల్లాస్ సంతతి యగు రాజకుమారుల నోడించుటచే, వారేయతనిని జంపిరని

యేజియస్ చెప్పెను. అందువలన మృతజీవితంట్రియగు మైనాసు దండెత్తివచ్చి ఈరాజ్యమునుజయించి "ప్రతిసంవత్సరమునను నేడుగురుయువతులను, నేడుగురుకన్యకలను సమర్పించుచుండు నట్లుఏజియస్ వల్ల వాగ్దానముచేయించుకొని తిరిగిపోయెను. నేను ప్రతిసంవత్సరమునను నిచ్చటికివచ్చినప్పుడు నేనుదెచ్చు నల్ల తెఱచాపగలనౌకలో, నేడుగురుకన్యకలను, నేడుగురుయువతు తులను నెక్కించి నాతోశతనగరవ్యాప్తముగు క్రీటుద్వీపము నకు బంపవలయును. నేను కేవలసేవకుడనుగాను. ఈసంధి కుదిరించిన రాయబారిని. నేనిప్పుడు మైనాస్ చక్రవర్తిపక్షమున దూతగా వచ్చియున్నాను. గనుక యీవాగ్దానము నెఱవేర్చు కొనుటకు ఈపదునలుగురుజీవులను నా వెంటనిప్పుడే పంప వలయును" అనియాదూత వాక్రుచ్చెను. అతనిప్రలాపమువిని థీసియసు పటపటపండ్లుకొఱికి "నీవు దూతవుగావా? నా తండ్రినిగుఱించి యిన్నియసంగతప్రసంగములు చేసినందులకు నిన్నేల వధింపగూడదు? అయినను నాతండ్రియొద్దకుబోయి యందలివాస్తవము నెఱిఁగెదను." అని జెప్పి తండ్రియొద్దకు బోయి వృత్తాంతమేమియని యడిగెను. అంతుల కేజియస్ రాజు "కుమారా! అక్రమముగా నీభూమిలో రక్తపాతము సేయబడినది. రక్తపాతమునకు రక్తపాతమేబదులుగా దీసికొన బడుచున్నది. నన్నిట్లుప్రశ్నసేసి నాహృదయవేదనను పెంచకుము. నిశ్శబ్దముగ నీవిపత్తు ననుభవించుటయే చాలును" అనినొడివి పెడమొగముపెట్టి, యతిదైన్యముతో నేడ్చుచు గన్నీరుగార్చెను.

థీసి—"ఈయువజనులతో నేనునుబోయి, మైనాసును అతనిసింహాసనముననే తుదముట్టించివచ్చెదను."

ఏజి—పుత్రికా! నీవు పోవలదు. అంధకారప్రాయమైన నావార్ధక్యమునకు నీవేజ్యోతివి. నేను తనుపు చాలించిన తరువాత, నీప్రజా పాలనము నీవే జరుపుమనసి నమ్ముకొని యున్నాను. ఈయువజనులతో బోయి వారివలె నీవును ఘోరమరణము పాలుగావలదు.

"శయోడలాస"నునతడు మైనాసుతోడను శిలాప్రాంతమున నొక దుర్గమనిశిలావ్యూహమును నిర్మించి యుంచెను. ఈయగాధ వ్యూహములో ప్రవేశించిన తరువాత మనుటిరిగి వచ్చుటకు మార్గము దొరుకదు. ఈయువజనుల నతడు మినోటార్ అను క్రూరమానవాదికి నప్పజెప్పుటకు పూర్వము వారి నీశిలావ్యూహములోనికి బంపును. ఈవ్యూహములో జొచ్చి వెదకులాడు సమయమున మినోటారు వారిపై బడి హత్యజేసి చెండాడి, వారిమేనుల రక్తప్రవాహములద్రావి, మాంసమును భుజించును. వారు తిరిగి యెన్నటికిని నీప్రదేశమును జేరజాలరు.

ఆదురంతరమరణముయొక్క విధానమును విని, థీసియస్ కోపారుణితలోచనుడయ్యెను. ఈపలుకులతని చెవులకు ములుకులై బాధ గూర్చెను. అతని హృదయము తీవ్రవేగనినాదములతో గొట్టుకొనెను. ఒక నిమిషమాత్రకాల మతడు నిర్ఘాంతపోయి, నిశ్చేష్టుడై వీరపురుషుని సమాధిపై గల శిలా సముచ్చయమునందలి నిడు రాతికంబమువలె నిలుచుండెను.

కొంతవడి కతడు తెలివితెచ్చుకొని యిట్లనెను. "అట్లయిన నేనత్యావశ్యకముగ వారితో బోవలయును. ఆఘోర దుష్టారణ్య మృగము నంతమొందించవలయును. ఈపవిత్రనగరమిని ఘోరహంతకులనుండి సురక్షితము సేయుటకు, ఎక్కుసాహస కృత్యములను చేసియుండలేదా? ఇప్పుడు పెరిఫిటీస్ ఎచ్చట నున్నాడు? సైనిస్ నాచేతిలో నంతమొందలేదా? కెర్కువాన్ నాచేతిలో దనజీవితములరు గోల్పోవలేదా? పల్లాస్ యొక్క ఏబదిమంది దుష్టకుమారు లిప్పు డెచ్చటనున్నారు? వీరందఱును బట్టిన త్రోవనే మినోటారుసైతము పట్టగలడు. మైనాసురాజును మాత్రము నేను విడిచి వత్తునా?"

ఏజి—"కుమారా! వారిని నీవెట్లుచంపగలవు? నీ కర వాలకవచములను ముందుగ నేతొలగించబడుదువు. తరువాత నీవు హంతకవ్యక్తియెదుట ద్రోయబడుదువు. దిగంబరుడవై నిరాధారముగ మృత్యుముఖమునబడి, యా ఘోరహత్యారూపమునుండి యెట్లు తప్పుకొనగలవు. పైనుండి దానినెట్లు నుఱుమాడ గలవు?"

థీ—ఆయగాధశిలావ్యూహమున రాళ్ళు దొరుకవా? నాకు పిడికిలి లేదా? పలువరుస లేదా? మానవజాతికెల్ల భయంకరమై మిలంగిన కెర్కువాన్‌నును నేను దండముతో జంపితినా?

ఎజియస్ అపుడు కుమారుని సాహసమయ ప్రత్యుత్తరములకు మాఱుపల్కక బిగ్గరగా నతసని గౌగిలించుకొని యేడ్చి కన్నీరు గార్చెను. ఒక్కవిషయమాత్రము నాకు వాగ్దానము చేయుమని యిట్లనెను. "నీవు తిరిగివచ్చుభాగ్యమే

దుర్లభమైనది. ఒకవేళ నీవు విజయముతో రాగలిగితివేని, నీనౌకకుండు నల్లతెఱచాపను దీసివైచి, తెల్లవలువను గట్ట వలయును. నేను ఈకొండ కొనపై నుండి నీరాకకెదురు చూచు చుందును. దూరమున నుండియే నీవు సురక్షితముగా నున్నావని తెలిసికొని ప్రాణత్యాగము సేయక, సంతోష ముతో నుండి, నీకు స్వాగత మొసంగగలను."

థీసియసు అందులకు వల్లెయని వాగ్దానము సేసెను. నగర వీధికిబోయెను. సందేశహారి యొద్దికిబోయెను. ఏఁయువ కులు పోవలయునని జనులు వంతులను వైచుకొనుచుండిరి. ఒక్కొక్కరివంతు నిర్ధారితమగుచున్నప్పుడు, ఆమాన్యవ్యక్తులను గాగిలించుకొనుచు, ప్రజలు దుఃఖించుచుండిరి. నగరమం తయు రోదనధ్వనిచే మాఱుమ్రోగుచుండెను. కాని థీసియస్ జనమధ్యమునకు బోయి, "నాకువంతనిర్ణయముతోఁ బనిలేదు. ఈయేడుగురు యువకులలో నేను మొదటివాడనై పోవు దును." అని యెలుగెత్తి పల్కెను.

అత్తఱి నావరరాజు దూత, "సుందరకుమారా! నీవు స్వయముగా బయలుదేరుచున్నావు. ఎచ్చటికి బోవుదువో తెలియునా?" యని హెచ్చరించెను.

"నాకు దెలియును. నల్లతెఱచాప నౌకయొద్దకు బోవు దము నడువుమని థీసియసు బదులుచెప్పెను."

కొంతవడికి ఏడుగురు కన్యకలును, ఆఱుగురు యువకు లును నగరప్రజలనుండి పయనమునకు సిద్ధమై [illegible]

ఓడవయువకుడుగా నుండి యందఱికంటె ముందుగా నిలువ బడెను. ప్రజల దుఃఖనినాదములతోఁ బయలుదేరి యువజనులు పదునలుగురు మృత్యుముఖమునకు జేర్చనున్న నౌకయొద్దకు నడచిరి. థీసియస్ తన సహచరులతోఁ రహస్యముగా "ధైర్యముతోఁ నుండుడు, హంతకరూపము చావులేనిదికాదు. పెరిఫిటస్, స్కైనిస్, స్కైరన్ మున్నగు క్రూరులను నేనెందఱినో చంపితిని." అని ధైర్యోక్తులు బలికి మనశ్శాంతి నుద్బోధించెను. యువజనుల మనంబు లించుక శాంతిజెందెను. నౌక ప్రయాణము జేయుచుండ, ప్రజల రోదనధ్వనులకు, ఏజియన్ ద్వీపమాలును, బర్వత శిలలును బ్రతిధ్వనులు సేయుచుండెను.

---

# వీరపురుషులు

## థీసియసు

## మూడవభాగము

### థీసియసు మినోటారును వధించుట.

---

మృత్యుదేవత కుపహారమును గైకొనిపోవుచున్న నౌకారాజము క్రమక్రమముగా క్రీటుద్వీపమును సమీపించెను. నౌకాతల్లజము మైనాస్ చక్రవర్తి రాజుసౌధము దరికి జేరెను. గ్రీకుప్రజల యుద్ధదైవమగు జీయస్స్వయముగా మైనాసుకు న్యాయసూత్రములను భోధించియుండుటచే, మైనాసు, మర్త్యులగు రాజులలో ఉత్తమమేధావి యయ్యెను. అతని కనేకములైన యుద్ధనౌకలుండెను. నౌకాసాహాయ్యముననే యతడు ఏజియర్ దీవులనన్నింటిని జయించుకొనెను. అతనిసౌధము నున్ననిచలువరాతితో నిర్మింపబడి రంగురంగుల ప్రకృతి చిత్రలేఖనములతో నానందదాయకముగా నుండును. నౌక సౌధముదరికి జేరునప్పటికి, రారాజు, శిల్పకళా కమలాసను డనదగుడైడలాసుచే నిర్మింపబడిన మణిస్తంభమధ్యగతమగు కాంచనసింహాసనము నలంకరించియుండెను. ఈ సింహాసనము చుట్టును మాటలాడు మానవవిగ్రహములు డైడలాసుచే నిర్మింపబడి యుండుటచే నదియొక యపూర్వప్రేక్షణీయ స్థానమైయున్నది.

డైడలాస్ చరిత్రము అతిచాతుర్య పూరితమైనది. ఇతడు ఎథీనియన్ ప్రజలలో నతినైపుణ్యముగలజీవి. సూటి చూచుకొని లంబరజ్జువునితడే కనుగొనెను. కొయ్యలనుగోయు పనిముట్లెన్నియో యితనిచే సృష్టింపబడినవి. నౌకాస్తంభములను, రజ్జువులను, నితడేసృష్టించెను. ఇతనికుమారుడగు ఇకారసు తెఱచాపలను నిరూపించినవాడు. అతనిమేనల్లుడగు పెర్డిక్సు అతనినిమించిన కుశలుడు. ఈతనిమేనల్లుడే, అంపమును దానిపన్నులను సృజించెను. మీనముయొక్క వెన్నెముక వైఖరిననుసరించి, దానికిగల కోతశక్తినిగమనించి, యాప్రకారముగ నొకసాధనము నినుముతోసృజించి దానికిఅంపమని పేరుపెట్టెను. కుంభకారుని కులాలచక్రమునుసైతము ఇతడే కనిపెట్టెనని గ్రీకులవిశ్వాసము. డైడలాసుకంటె నతని మేనల్లుడే ఎక్కువపనిముట్లను సృష్టిజేసియుండుటచే నతడత్యంత శ్లాఘనీయుడయ్యెను. ఈతనిప్రశస్తినివిని యోర్వలేక డైడలాసతనిని ఎథీనుదేవాల యోపరిభాగమునుండి క్రిందికి బడద్రోసివైచెను. విజ్ఞానమునుప్రేమించు ఎథీనుదేవత యతనిని గనికరించి, యొకకౌజుపక్షినిగానొనర్చి ఎప్పటికిని బర్వతములపై నెగురులాడు శక్తిగలదానినిగా జేసెను.

ఆతరుణమున డైడలాసు క్రీటుద్వీపాధిపతియగు మైనాసువద్ద శరణముపొంది, పలుసంవత్సరములతనియొద్దఁ చిత్రవిచిత్రశిల్పనిర్మాణములు సేయుచుండెను. ఆసమయముననే యతనిసింహాసనముచుట్టును నీమాటలాడువిగ్రహములను నిర్మించెను. తుట్టతుదకచ్చటగూడ డైడలాసు, సిగ్గుమాలిన పనిచేసి సూర్యునియాగ్రహమునకు బాత్రుడై, యూర్ధ్వ

ప్రాంతమున మోఖము దాచుకొనవలసినవాడుగా జేయుబడెను. మైనాసునకును నతనియందాగ్రహ ముదయించుటచే గ్రీటు ద్వీపనుండియు బాఱిపోయెను.

అటుపిమ్మట డైడలాస్ ఇకరాసులు పక్షులయీకెలతో పెద్దపెద్ద ఱెక్కలను సృజించి వానినిమైనమతో మేనుల కంటించుకొని యెగిరిపోవనేర్చిరి. వారుభయులును సముద్రము మీద నెగురుచు సిసిలీద్వీపప్రాంతములకు బ్రయాణాము సేసిరి. ఇకారసు చాలపైకెగిరి సూర్యునికి సమీపముగాబోవుటచే, నతని మేనిమైనముకరగి, ఱెక్కలూడిపోన, నతడు ఇకారియను సముద్రములోబడి విగతజీవుడయ్యెను. డైడలాసు సురక్షితముగా సిసిలీద్వీపమునకు జేరెను. అచ్చటనతడు చిత్రవిచిత్రములైన శిల్పకార్యములను జేసెను.

ఇంకా నాతడొనర్చిన పనులుచాలగలవు. కేకలాస్ ప్రభువున కొక జలాశయమునుగట్టియిచ్చెను. ఆ జలాశయమునుండి ప్రవహించు ధారలు భూమిపై బ్రవహించి, సర్వప్రదేశమును సస్యశ్యామలముగా నొనరించెను. ఒకపెద్దనది యీ జలాశయములోనికిం బ్రవేశింపజేయబడుటచే నది యెల్లవేళలయందును జలపూరితమైయుండును. ఆజలాశయము మూలమున దేశమంతయు నెంతయో భాగ్యవంతమయ్యెను. అతడొకపర్వతాగ్రమున రాజు కొక దుర్గమును నిర్మించి, దానిలో నొక ధనాగారమును గల్పించెను. సిలీనాస్‌లో, నాశిల్పిసత్తముడు, ఈట్నా అగ్నిజ్వాలలనుండి యుదయించు నావిరిసాహాయ్యమున మానవుల సర్వబాధలను దొలగించగల యావిరి స్నానపు

విధానమున కవకాశము చేసెను. అతడొక బంగారు తేనె తుట్టెను నిర్మించెను. మధుమక్షికము లాతుట్టెలో దేనెను పెట్టుచుండెడివి. ఐగుప్తుదేశ భాగమగు మెంఫిస్‌లో హెఫియాస్ టాస్ దేవతకొఱకొక యాలయము నిర్మించెను, దాని ముఖ మండపము నత్యద్భుత రీతిని నిర్మించి, యందు తనవిగ్రహ మును జేసి నిలువబెట్టెను. మఱియునతడనేకములైన చిత్ర విచిత్ర శిల్పకార్యములను జేసెను.

మైనాస్ కొఱకితడు చివరకాలమున నిర్మించిన విగ్రహ ములు మాటలాడుటయేగాక, అటునిటు గదలుచును నుండె డివి. బ్రిటోమార్టిస దేవాలయము నద్వితీయ సౌందర్యముగల దానినిగా నిర్మించెను. మైనాసుకుమార్తెయగు యేరియేను పేరిట, తెల్లని చలువ రాతితో నొక నృత్యమందిరమునునిర్మిం చెను. సార్డినియాలో అయోలయాస్ ప్రభువుకొఱకు అనే కములైన సౌధములు నిర్మాణముచేసెను.

థీసియస్ మైనాస్‌ప్రభువు మ్రోల నిలువబడి యతని ప్రత్యేక దృష్టి నాకర్షించెను. ఒకరివంక నొకరు సాభిప్రాయ ముగ నవలోకించిరి. వీరిని గారాగారములోనుంచి యొకరి తరు వాత నొకరినిగా మానవభక్షకుని ముందువేయుమని యాజ్ఞా పించెను. అప్పుడు థీసియసు మైనాసుతో "ఓ, రాజరాజా! ఒక వరమిమ్ము. తొల్త నన్నా క్రూరమృగము మ్రోల ద్రోయించుము. ఏలయన నేను వంతుప్రకారము గాక స్వయ ముగా గోరుకొని యుందుకొఱకే వచ్చియున్నాను."

"ధీరయువకుడా! నీవెవ్వరవు?"

"మానవులందఱిలో నీవెవ్వరి నెచ్చుగా సేవగించు కొనుచున్నావో అట్టి యేథెన్సు ధరాధిపతియగు యేజెయ స్సునకు నేను కుమారుడను. ఈవ్యవహారమును ముదముట్టించు టకు నేడు నేనిచ్చటికి వచ్చియున్నాను."

ఆవాక్యము నాలకించి, మైనాసు కొంతతడవు నాలో చనుడై, నిశ్చలముగా థీసియస్ వంకఁజూచి, "ఈబాలుడు తన తండ్రి చేసిన పాపమును శాంతింపజేయుటకు, తానే స్వయ ముగా శరీరత్యాగము సేయవచ్చినాడు. అతడు తన త్యాగ ముతో పాపశాంతియై యితరజనులకు మృత్యువుదప్పునని యుదార స్వభావముతో భావించుచున్నాడని తలంచి యిట్లనెను.

"కుమారా! శాంతచిత్తముతో వెనుకకు మరలి పొమ్ము. ఇంతధైర్యశాలియగు ధీరుడు వ్యర్థముగా మరణిం చుట యొక విచారకరమైన యంశము."

థీసి—"హంతకమృగమును ముఖాముఖినిజూడక నేను వెనుకకుదిరిగిరానని ప్రమాణముచేసివచ్చినాను ఈపాటున నేను వెనుదిరికి పిఱికిపందవలె పాఱిపోవుట నాకుధర్మము గాదు."

మైనాసు—తద్వాక్యమునువిని యేవగముతో మంద హాసముసేసి, "మంచిది, నీవాకూ్రరమృగమును జూడ వచ్చును." అని యానతిచ్చి, సేవకునితో "ఈవెఱ్ఱివానిని దొలుత హంతశాలయమునకు గైకొనిపొమ్మని పల్కెను.

సేవకులప్పుడు థీసియసును జెఱసాలకుగొంపోయిరి. యువకు లను గన్యకలను వానివెంట జెఱసాలలోనికి దీసికొనిపోయి బంధించిరి.

ఆసమయమున మైనాసురాజుకుమార్తెయగు యేరియేను తన తెల్లచలువరాతి సౌధమునుండి వెలుపలికివచ్చుచు థీసియసునుజూచి, యాతని ధైర్యసాహసములకును, రాజలక్షణ సంపత్తికిని, మెచ్చుకొని యాతనిని హృదయపూర్వకముగాఁ బ్రేమించెను. "ఇట్టియువకుడు మృత్యుముఖమునకు బంపబడుట యవమానకరమ"ని ప్రసంగించెను. ఆరాత్రి యారాజకుమారి చెఱసాలకుబోయి, థీసియసుకు తన ప్రేమరహస్యము నెఱిగించి "ప్రియా! ద్వారరక్షకులకు దగుపణమొసంగితిని. రేవు కడనున్న మీయోడయొద్దికి వెంటనేపటువెత్తుము. ప్రాణము లున్నచో బైవిచారము సేసెదము. నీవొక్కడవేగాక నీ మిత్రులనందఱిని వెంటదీసికొనిపొమ్ము. నన్నుగూడ నీవెంట గైకొనిపొమ్ము. నన్నుఁ బరిగ్రహింపుము. నాతండ్రి క్రూరుడు నీవు వెడలిపోయినతరువాత, యిట్లుచేయించిన నానేరమునకు నాతండ్రినన్ను ఘోరహత్యపాలుసేయును. కావున నేనిం దుండరాదు. త్వరపడు"మని ప్రోత్సహించెను.

థీసియసు క్షణమాత్రము నిశ్శబ్దముగానుండి యామె యసమాన సౌందర్యము నేకదృష్టితో నవలోకించెను.

ఆరాజకుమారి మానవాతీత సౌందర్యాతిశయము. వీరకుమారుని చిత్తమున కచ్చెరువుగొల్పి యతనిని డోలాయమాన మానసునిజేసెను. థీసియసు మానసమామనోహారిణి

యందు దగులుకొన్నను. వీరపురుషుడగుటచే, తనసాహస కృత్య నిర్వహణమును విస్మరింపలేదు. అసందిగ్ధసమయమున, నేమిచేయవలయునని యించుకతడవు తర్కించుకొని, కేవల కాంతానురాగముచే, బహుజనోపకార స్వరూపమైన క్రూర మృగ సంహారణమును విరమించుకొనరాదని నిశ్చయించు కొని, తుదకా రాజకుమారిని సంధించి "ఇంతమంది యువతీ యువకులను బొట్టును బెట్టుకొన్న ఈక్రూరమృగమును గసిదీఱ జంపినంగాని నేను హృదయశాంతి నొంది స్వదేశమునకు బోజాలను. నాదేశమున బ్రిజల కీక్రూరమృగమువలన ననంత మగు భయోత్పాతములు గలిగియున్నవి. ప్రజాహృదయ శాంతి సేయని రాజునకు రాజ్యపాలన మర్హమైనది కాదు." అనివాక్రుచ్చెను.

"నీవాక్రూర దుష్టమృగమును జంపుదువా? ఏమి చేసెదవు?"

"ఎట్లు చంపవలయునో యిప్పుడు నాకేమి తెలియదు. ఆవిషయమును నేను లక్ష్యపెట్టుటలేదు. నేను సాహసాన్వ డనుగాను. నన్ను జయింపవలెనన్న నాదుష్టమృగము చాల సత్వముగలది గావలయును."

ధీసియను పల్కిన ధీరవాక్యమున కామె చిత్త ముప్పొంగి యారాజకుమారి యాతనియం దత్యంతాధిక ప్రేమానురాగము నొందెను. అతనికి దగు సహాయము సేయ నెంచి, యానవకోమలాంగి, ఇట్లనెను.

"నీవా దుష్టజంతువునుజంపి తిరిగి యెట్లురాగలవు" అదియొక శిలావ్యూహము, దానిలోనికి బోయినవారు మగుడి వచ్చుమార్గమును గనుగొనలేరు."

"ఆసంగతి నాకు దెలియదు. నేను దిరిగివచ్చు సంగతిని గుఱించి లక్ష్యపెట్టుటలేదు. నేనాజంతువును జంపి నంతవఱకు వెనుకకు దిరిగి వచ్చుమార్గమును గుఱించి విచారింపవలసిన అవసరము లేదు. ఎంతవిపరీతమార్గమైనను క్రూరమృగ మరణానంతరము చిత్తశాంతి జెందినతరువాత, నేను బోయినబాటను నేను వెదకికొనజాలనా? ప్రాతబాట లభింపనిచో నడ్డము వచ్చిన కొండలనెల్ల పొడిచేసి క్రొత్తబాట చేసికొని వెలుపలికి రాగలను. క్రూరమృగమును సంహరించి, నాపదుముగ్గురు మిత్రులను సంరక్షించుకొనుటయు, నా దేశవిప్లవమునుమాన్పుటయు, ప్రధానాంశములుగాని, యాత్మరక్షణకొఱకు విచారించుకొనుట ముఖ్యాంశముగాదు."

ఆ ప్రసంగముపై నామె ప్రేమ యినుమడించెను.

"సుందర వీరకుమారా! నీధైర్య సాహసములు ప్రశంసనీయములు. నేను కృశాంగిని. అబలను అయినను నీకు సాయము సేయవలయునని నాయభిలాష. నేను నీకొక ఖడ్గము నిచ్చెదను. దానితో నీవాదుష్టజంతువును సంహరింపగలవు. మఱియు నీకొక దారపు చక్రము నిచ్చెదను. దానిసహాయమున నీవు తిరిగివచ్చు మార్గమును గనుగొనగలవు. నీవు సురక్షితముగా వచ్చినచో, నీవు గ్రీసుదేశమునకుబోవునప్పుడు నన్ను నీవెంట గొనిపొమ్ము. ఏమన, నేనుచేసిన యీ

తోడ్పాటు నాతండ్రి తెలిసికొనినచో, నతఁడు నన్ను నిశ్చయముగా చిత్రవధపాలు సేయును.”

థీసియసు సహాసవదనుఁడై “రాజకుమారీ! నేనిప్పుడు సురక్షితముగా నుంటినిగదా?” యని యాఖడ్గమును దనవక్షస్థలమున దాచెను. దారపుచక్రమును జేతనిముడ్చుకొనెను. రాజకుమారితో “నీకోరికప్రకారము నేనునిన్ను గ్రీసుదేశమునకు దీసికొనిపోవుదునని ప్రమాణపూర్వకమైన వాగ్దానము నొనరించెను. ఆమెమ్రోల సాగిలబడి, కేల్గవను ముమ్మాఱు ముద్దుపెట్టుకొనియెను. అతనికొఱకామె చాలతడవు దుఃఖించి సురక్షితముగ బోయిరమ్మని శుభవాదముసెప్పి, మగుడితన తావునకుబోయెను. థీసియసు కారాగారమున మనశ్శాంతితో గాఢముగా నిదురించెను.

మఱునాఁడు సాయంకాలమున, రక్షకభటుడు థీసియసు వద్దకువచ్చి, తొలుతనతని నాశిలావ్యూహమునకు దీసికొనిపోయెను. విషాదహేతుకమును, భయంకరమును, శిలాపరివృతమునునగు సింధుశాఖలోని యగాధసీమయందున్న దుష్టమృగముచేఁ జంపబడుటకు, రాజభటుడు థీసియసును గుహాముఖమున విడిచెను. గుహాముఖమునుండి థీసియసు లోనికి బోదగినమార్గ మెన్నియోచుట్లు తిరిగియుండెను. ఆధైర్యశాలి ఎడమవైపునకును, కుడివైపునకును, పైకిని గ్రిందికిని నడచుచు చిమ్మచీకటిలో ముందుకు నడచిపోవుచుండెను. గుహాముఖమున నొకరాతికి దారమును బిగియగట్టి యాదారమును దనతో గొంపోవుచుండెను. ముందుకు బోయినకొలంది దార

మును వదలకను తిరిగినప్పుటకు మార్గనిర్దేశమును జేయుచుండెను. నల్లరాళ్ళనడుమనున్న యొక ఖాతములోనున్న మినోటారును సమీపించునంతవఱకును దారముపొడవు సరిపోయెను. అతడు మున్నెన్నడును నట్టివింతమృగమును జూచియుండనికారణమున, నతడా మృగమువంక నొక్క నిమిషమాత్రకాలము వింతగా తేఱిపాఱజూచెను. ఆమినోటారు శరీరము మానవశరీరమును బోలియుండెను. దాముఖము ఎద్దుముఖమును బోలియుండెను. దానిపండ్లు సింహముదంతములను బోలియుండెను. ఈకోరలతోడనే యది మానవులను జీల్చి, భక్షించును. అది థీసియసును జూచినవేంటనే భీకరమైన గర్జనముచేసెను. తలను గ్రిందికివాల్చెను. ముట్టెను నేలకునానించెను. ఒక్కసారిగ నతివేగముతో థీసియసుపైకి బఱువెత్తెను.

థీసియసు యుక్తి యుక్తముగా బ్రక్కకుదప్పుకొని, తన కరవాలముతో దానిమోకాలును నఱికెను. దుష్టమృగము వెనుకకు దిరుగక పూర్వము థీసియసు దాని వెనుక భాగమున వెంటనంటి పలుసారులు దానిమేనఁ బలుతావులఁ బొడిచెను. మృగము పెద్దగానార్చి పాఱిపోవసాగెను. థీసియసు త్రోవ దారమును దనయెడమచేతఁ గట్టిగా బట్టుకొని, దానివెంట నతి తీవ్రవేగమున బఱువెత్తెను.

దుష్టజంతువు జొచ్చిన గుహాలన్నిటను బ్రవేశించి పఱుగెత్తెను. గండశిలలపైకి దానివెంటనంటి పఱుగుతో నెక్కి దిగుచుండెను. కఱుకుఱాల యిఱుకుమార్గములజొచ్చి శీఘ్ర

ముగ నడచెను. మంచుగడ్డ లెదురగుసంతవఱకు దానివెంట నుఱికెను. మృగము పెట్టిన బొబ్బలకు గిరులెల్ల మాఱుమ్రోగెను. తుదకా క్రూరమృగము తప్పించుకొనలేనిచోటికిం జేరి, సారముడుగబడిపోయెను. థీసియసు అప్పుడు దానియెదుటికి బోయి రెండు కొమ్ములను బట్టుకొని వెనుకకును ముందుకును నూపి సమయానుసారముగ గత్తిపెఱికి కంఠమున బొడిచెను. క్రూరమృగము ఉసురుల దొఱంగెను.

అంతట థీసియసు త్రోవ దారము సహాయ్యమున బాటతప్పక యుంటుచు, నిశ్శ్వాసములు సేయుచు, నతిధైర్యముతో నల్లనల్లన భయంకర గుహాముఖద్వారమునకు జేరుకొనెను. అతని పునరాగమనమున కెదురుచూచుచున్న మదనమోహన సుందరాంగి యగు ఏరియల్ రాజకుమారి యాద్వారమునొద్దనే యగపడి యతనికి శ్రమనోపశాంతిసేసెను. థీసియసు గద్గదస్వరముతో "కార్యము పూర్తియైనది" యని పల్కి, రక్తసిక్తమగు కరవాలము నామెకు జూపించెను. రాజకుమారి యత్యాశ్చర్య నిమగ్నమానసయై ముక్కున వ్రేలిడికొనెను. అంతనతనికి నుపచారవాక్యములు సెప్పుచు, కారాగార రక్షకులచే మధుపానము చేయించి, వారినెల్లర నిస్పృహులను జేసివచ్చితిని. చెఱసాలలోని నీమిత్రులను దీసికొని నన్ను వెంటగొని గ్రీసుదేశమునకు జేరవలయునని చెప్పి యతని నొడంబఱచెను.

థీసియసు రాజకుమారి చెప్పినప్రకారము చెఱసాలకు బోయి నిశ్శబ్దముగ ముఖద్వారమును దెఱచి తనమిత్ర బృంద

మును చెఱసాల వెడలించెను. రాత్రి యంధకార బంధురమై యుండెను. అందఱును గలిసి సముద్రతీరస్థమగు నౌక నధివసించి తెఱచాపను విప్పిరి. ఆసమయమున దైవానుగ్రహముచే, గాలిపాటు వారిప్రయాణమున కనుకూలముగనుండెను. సముద్రము శాంతముగ నుండెను. ఆ రేవున నమరించబడి యున్న మైనాసుప్రభువు నౌకలోని నావికులెల్లరు గాఢనిద్రాపరవశులై యుండిరి. థీసియసు నౌక యతితీవ్రవేగమున నచ్చోట నౌకల యనుసరణమునుండి, దట్టంపు జీకటికతమున నదృశ్యముగ నావలబడి, నిరంతరాయ ప్రయాణముసేసెను. నౌక దూరమునకు బోయినకొలఁది, మృత్యుముఖమునుండి తప్పుకొనివచ్చిన యువక మిత్రులుల్లాసముతో మధురగాయనముల బాడిరి. కన్యకామణులు తమతమ నృత్యవిలాసముల బ్రదర్శించి, సవన్యసంవరుల కానందము గూర్చిరి. ఏరియేన్ రాజకుమారి థీసియసు ధర్మసాధ్వియయ్యెను. అందఱును సురక్షితముగ గ్రీసుదేశీయ నగరమగు నాక్సాసునగరమునకు జేరిరి.

# వీర పురుషులు

## థీసియసు

## నాలుగవ భాగము

## థీసియసు గర్వముచే భంగపడుట

---

చక్కదనంపు జుక్కయగు నేరియన్ రాజకుమారి, తగుకాలము మనసుదీర దనమనోవల్లభుని సేవసేయు భాగ్యమును నోచుకొని యుండలేదు. ఆమె ఏథెన్సునగరమునకైనను జేరలేదు. నాక్సాస్‌నగరమున నిద్రించుసమయమున నామెయు గన్యకలతో పాటునిద్రించెను. నౌకారాజము క్రమ్మఱ బయలుదేరునపుడు, శీఘ్రయాన తత్పరుడై యున్న థీసియసు అందఱను నౌక నధివసింపుడని చెప్పి తానుముందే యోడలోనెక్కెను. ఓడ జాము ప్రొద్దువేళనే ప్రయాణము చేయుచున్న కారణమునఁ దెల్లవారిన దనుక నందఱును నిద్రాయత్తులై యుండి, యెవ్వరెవ్వరోడ నెక్కిరో యెవ్వరును గుర్తింపలేదు. సూర్యోదయ సమయమునకే, యనుకూల వాతప్రసారమువలన నోడ చాలదవ్వునకు బోయినది. ఏథెన్సు దృష్టిపథమునఁ బడునంతటి దూరమునకు వచ్చిచూచుకొనగా, ఏరియేన్ రాజకుమారి యోడలో గానరాదయ్యెను. థీసియసు అత్యంత విచార నిమగ్నుడయ్యెను. అసమాన సుందరాంగిని

గోలుపోవుట యోగాక తనకు బ్రాణదాత్రియై, మృత్యుముఖము నుండి వెలువడుటకు దోడ్పాటుచేసిన యుపకారిణికి గృతజ్ఞత నూపక పోవుట యాధీరపురుషుని స్మృతిజ్ఞానమునకు మాంద్యమును గలుగజేసెను. దుఃఖాతిరేకమున బుద్ధిమాంద్యమును బడసిన థీసియసు, ఏథెన్సు చేరకపూర్వము, తండ్రియాజ్ఞ ప్రకారము నౌకకు దెల్ల తెఱచాప నెత్తమఱచెను.

డయొనుసాస్ అను మధుపానీయాధిపతి, యేరియాన్ రాజకుమారిని నాక్సాసువద్ద నిద్రించుసమయమునుజూచి, యామె సౌందర్యమును గమనించి, మోహితుడై, మధుపానమత్తనుజేసి పిమ్మట స్వగృహమునకు గొంపోయెనని గొందఱు చెప్పెదరు. సనాతన చిత్రలేఖకుడగు టిటాను చిత్రించిన సవర్ణ చిత్రములలో డయొనుసాస్ ఏరియేను నెత్తుకొని పోవుచున్నట్లు లతి చాతుర్యముతో జూపబడినది. భూవలయమునందంతట సుప్రసిద్ధ వడసిన చిత్రపటములలో, నిది యొక్కటిగాఁ బరిగణింపబడుచున్నది.

థీసియస్ క్రీటుద్వీపమునకు బోయిన దినమునుండియు, నతనితండ్రి ఏజియసు, తన కుమారుడు విజయము నొంది రావలయునని యెల్లదైవములకును మ్రొక్కుచుండెను. కొలఁది దినములైన తరువాత నతడు, తీరసౌధాగ్రమునఁ గూరుచుండి తెల్లతెఱచాపగల నౌకకై యెదురుచూచుచుండెను. తుదకతడు దూరమునుండివచ్చునౌక నల్లతెఱచాపగలదియైయుంచుటం జూచెను. దానినిబట్టి, తనకుమారుడు బ్రతికివచ్చుచున్నచో, తెల్లతెఱచాపనే కట్టియుండెడివాడనియు, నతడు

మిత్రిపాలగుటచే నోడ నల్ల తెఱచాప ధరించివచ్చుచున్న దనియు దలంచి, మిగుల దుఃఖించి, సముద్రములోని కుఱికి విగతజీవుడయ్యెను. అందువలననే యాసముద్రము నేటికిని నేజియన్ సముద్రమని పిలువఁబడుచున్నది. థీసియసు ఏథెన్సుకుజేరి, తండ్రిమరణమును విని మిగుల దుఃఖించెను. పదంపడి ప్రజల యభిమతము ప్రకారము ఏథెన్ రాజ్యమున కధిపతియై ప్రజారక్షణము సేయుచు జిరకాలము, భూపరిపాలనము సేయుచు, సర్వసుఖముల ననుభవించుచుండెను.

థీసియస్ కొన్నినాళ్ళయిన తరువాత, మైనాస్ కుమారుడగు ఆండ్రోజియస్సును జంపిన క్రూరవృషభమును జంపుటకై మారాథాన్ ప్రాంతమునకుబోయెను. అచ్చట నా దుష్టవృషభము జూడనెఱింగి, దానితో నతిధైర్యమున బోరాడి, దానిని యమలోకమున కంపెను.

అనంతరమున నాసియాఖండము నుండివచ్చి, హెల్లాసును జయించి, యేథెన్సు రాజ్యములోనికి జొచ్చుకొనివచ్చు రణరంగ ప్రీతికిఁ బ్రసిద్ధికెక్కిన పాచ్యదేశీయులగు నెమజాన్ వీరభామినులదండును వెనుకకు బాఱద్రోలెను. వారి రాజ్ఞియు సేనానాయకురాలును నగు హిప్పొలుట్యాట్ అను యువతిని దనధర్మపత్నినిజేసికొనెను. అంత లెపిథామ్ దేశముపై దండు వెడలి, తద్దేశాధిపతియగు పేరిథూసుతో పోరున నిలువ సిద్ధపడెను. కాని యవ్వీరపురుషులిరువురును ఒకరినొకరుజూచి యన్యోన్యమైత్రి నొంది, పరస్పరాలింగనముల జేసికొనిరి.

థీసియసు ఏథెన్సును గొప్పరాజకీయ తంత్రముతోఁ

పరిపాలనసేసెను. అప్పటికి భిన్నభిన్నములుగానున్న ప్రాంత ములుగా నుండి నిస్సారములుగా నున్న ప్రాంతముల నన్ని టిని నొక్కటిగా జేసెను. థీసియసును దమ స్వాతంత్ర్యమున కును, న్యాయ సూత్రస్థాపనమునకును, దమ జనకుడని యేథెన్సుప్రజలు చిరకాలము దనుక గొనియాడుచుండిరి. అతడు అదృశ్యుడైన పిమ్మట నాఱు నూర్ల సంవత్సరములకు పారసీకులు ఏథెన్సుపైకి దండు వెడలిరనియు, మహాలోహ దండమును హస్తమున నుంచుకొనిన థీసియస్ తనుచ్ఛాయ తన దేశ సంరక్షణమును గొఱకా పారసీకులతో బోరాడినట్లు గానవచ్చెననియు, బ్రజలు చెప్పుకొనుచుందురు. మరథాన్‌లో వృషభ హననము జేసినపిమ్మట నిరువది సంవత్సరములకు, సము ద్రమున నావలి కెదురుగనున్న స్కైరోస్ దేశములో థీసి యస్ మేని యస్తు గలపడెను. అవిసాధారణ మానవుల యస్థులకంటె నధికపరిమాణము గలిగియుండుటవలన ఏథీ నియనులు వానిసిగుర్తించి థీసియస్‌వేయని విశ్వసించి విజయ నినాదములతో వానిని స్వదేశమునకు గైకొనివచ్చిరి. ప్రజ లందఱును నాయెముకలకు స్వాగతమొసంగిరి. ఆయస్తికలపై ప్రజలొక పెద్ద యాలయమును గట్టిరి. వివిధములైన రంగులు వైచి దానినలంకరించిరి. ఆలయముచుట్టును థీసియసు పరా క్రమము చూపిన వీరరంగములకు సంబంధించిన చిత్రములను శిల్పకారులు మనోహరముగా జిత్రించిరి. వాని శిష్టభాగములు నేటికిని దృశ్యములైయున్నవి.

థీసియసు స్వదేశమున దనదండ్రి వజ్జ సమాధిలో నేలశయసించలేదను శంక చదువరులకు దోచకమానదు.

విజయ సమార్జనానంతరమున థీసియసు గర్విష్ఠుడై, భగవన్నిర్దిష్టధర్మములను, మానవనిర్దిష్ట ధర్మసూత్రములను నుల్లంఘించి, సంచరించెను. తనమిత్రుడగు పేరీతూస్‌తోఁ గలిసి, యధోలోక పాలినియగు పెరిస్ఫోనె మహారాజ్ఞి నపహరించుటకు బ్రయత్నించిన, పేరీతూసుకు దోడ్పాటు సేసెను. పేరీతూను అధోభూమియందు నిర్దాక్షిణ్యముగ జంపఁబడెను. థీసియసు నిరంతర బాధ ననుభవించునట్లు శృంఖలములచే నొక పెద్దగండశిలకు గట్టబడి నిర్బంధింపఁ బడెను. అట్లతడు కొన్ని సంవత్సరములవఱకు దురంతబాధ ననుభవించుచుండెను. కాల క్రమమున హెర్క్యులస్ మహావీరు డతనిని బంధముక్తుని జేసెను. మఱియొకసారి యతడు ఏథెన్సునకువచ్చెను. గాని ప్రజాగణము లతనిని విస్మరించిరి. అతడొనరించిన మఱియొక ఘోరాపరాధమువలన గినిసి, స్పార్టా రాజు కుమారులు కాస్టర్ పాలిడ్యూసిస్ అనువీరులు థీసియస్ రాజ్యముపై దండువిడిసి, యతని తల్లియగు నైత్రారాణిని, బానిసగా గొంపోయిరి.

అప్పుడు ఏథెన్సు రాజ్యాభ్యుదయమునకు భంగము గల్గెను. మఱియొకరాజు రాజ్యమునాక్రమించి థీసియస్‌ను వెడలనడచెను. అప్పటికివృద్ధుడై సత్వహీనుడైన థీసియసు పాఱిపోయి సముద్రముదాటి స్కైరాస్ దేశమునఁ దలదాచు కొనెను. తద్దేశాధిపతియగు లూకొమెడీస్‌యింటనే యతడు దాగియుండుటచే, నారాజు కొన్నినాళ్ళకతనిపై నీర్ష్యగొని, యతనిని మోసముచే నంతమొందించెను.

సత్వమును ధర్మశీలమును భగవదాజ్ఞానుసారముగా

మానవునకు లభించును. మానవుడు గర్విించి, స్వేచ్ఛావిహారియై, భగవత్ప్రసాదమును దుర్వినియోగము సేయునేని, భగవంతు డతనిని తనకర్మఫలభోగమునకు విడిచిపెట్టును. అట్టి మానవు డిహపరములయందు చెడును. భగవానుడు మనకు జ్ఞానసంపద నొసంగి తోడ్పడునుగాక. ఘనకార్యముల నొనరించుటకు ధైర్యసాహసముల నొసంగి రక్షించుగాక. మనమట్టి ఘనకార్యములను నిర్వహించినపిమ్మట, గర్వమునొందకుండ గాపాడుగాక. గర్వఫలితములైన యధఃపతనమును నవమానమును మనకు గలుగకుండుగాక.

---

# వీర పురుషులు

## పర్సియసు

## మొదటి భాగము

### పర్సియసు తల్లితో సెరిఫాసుకు వచ్చుట.

తొల్లినొకప్పుడొక రాజసాధ్వికి కవలుగాజనించిన యిరువురు రాజకుమారులుండిరి. వారిలోనొకనికి అక్రిసియస్ అనియు, రెండవవానికి ప్రోటస్ అనియు నామము లొసంగఁబడెను. హెల్లాస్ ప్రాంతమున దవ్వులనుండి సౌఖ్యదాయకమై విలసిల్లు ఆర్గాస్ లోయలో వారు నివసించుచుండిరి. ఆ పర్వత మధ్యప్రదేశమున, పచ్చికబయళ్ళును, ద్రాక్షాకాయమానములును, నెల్లవేళల సవిలాసములై కనుపండువు సేయుచుండెను. ఆలోయయందలి భూసారము కారణమువలన నభివృద్ధిసెందు నభినవగ్రాసాంకురముల మేసి, సారంగములును, నజరోమశసంచయంబులును, వృషభతురంగాది, పశుగణంబులును బలసంపన్నములై విహరించుచుండును. అట్టియభ్యుదయోపేతమైన భూఖండమున కారాజకుమారు లధిపతులైనను, వారెల్లవేళలఁ జింతాక్రాంతచిత్తులై యుండెడివారు. ఏలయన, వారుదయించినదినము మొదలుకొని యొండొరులపై మచ్చరమువహించి, కలహించుకొనుచుండిరి. ఆరాజ

కుమారులిరువురును సమానభాగస్వాములయు, నొకనిరాజ్య భాగము నింకొక డపహరింపవలయునను నీర్ష్యాగ్నిచే దహింపబడుచుండిరి.

తొలుదొల్త అక్రిసియసు, ప్రొటసును బరాభవించి రాజ్యమునుండి వెడలగొట్టెను. ప్రొటసు పరాభవానల దందహ్యమానహృదయుండై, సాగరముందాటి పరదేశమున జొచ్చి, యొకరాజకుమారిని కులాంగనగాజేసికొని, సైక్లోపు జాతీయులైన యుద్ధవీరుల సాహాయ్యమునుగోరి, వారినెల్లఁ దనవెంటనిడుకొని, క్రమ్మఱనిజరాజ్యమునకు జేరెను. అత్తఱి బ్రొటసుపక్షము బలవత్తరమగుటచే అక్రిసియసు వెనుకంజ వైచెను. అట్లుభయులును గొన్నిదినములు పోరాడి, మధ్య స్థుల నిర్ణయించుకొని, వారుచెప్పినప్రకారము, ప్రొటసు రాజ్యభూమిలో సగభాగమును, అర్గాసులోయకంటియున్న టిరిన్సులోయను దీసికొనుట కంగీకరించెను. అక్రిసియసు రాజ్యభూమిలో సగభాగమును, అర్గాసులోయను దీసికొనుట కంగీకరించెను. ప్రొటసు, సైక్లోపులసాహాయ్యముచేత టిరిన్సు లోయచుట్టును సహజగండశిలాన్యాసముచే, దుర్భేద్యమగు దుర్గమును నిర్మించెను. ఆకోటగోడలు నేటికిని నిర్మాతల నిర్మాణచాకచక్యమును వెలిబుచ్చుచున్నవి.

కవలీవిధమున వేఱుపడి, స్వలాభముకొఱకు కృషిచే యుచు గాలము గడపుచుండ నొక దినమున, భవిష్యద్వాది యగు నొకమహనీయుడు కర్కశహృదయుడగు అక్రిసియస్ వద్దకువచ్చి "రాజకుమారా! నీవు నీరక్తబాంధవులపై ద్వేష

ముబూనితివి గనుక నీర క్తబాంధవులు నీపై ద్వేషమువహింతురు. నీవు నీసన్నిహితున కెగ్గుసేసితివి గనుక, నీస్నిహితులచే నీవు శిక్షింపఁబడుదువు. నీకుమార్తెయగు "డానే, కొకకుమారుడుదయించును. అతనిచేతులలో నీకు మృత్యువు వాటిల్లును. దేవతలిట్లు విధించిరిగావున నీవిధి నీకు దప్పిక అనుభోగ్యము కాజాలదు."

ఈమహావాక్యమతని చిత్తమునకు భీతి గొల్పెను. గాని అక్రీసియసు తన నడవడిని మాత్రము మార్చుకొనలేదు. అతడు తన కుటుంబమున సైతము క్రౌర్యముతోడనే ప్రవర్తించుచుండెను. ఆమహనీయుని వాక్యముల వినినపిమ్మట నతని క్రౌర్యము తగ్గుటకు మారుగా సధికమయ్యెను. తన కుమార్తెను, భూగర్భమున సిత్తడితో గట్టబడిన యొక గుహాలో బంధించియుంచెను. దేవతల విధివాక్యములెట్లు సార్థములు కాగలవో చూచెదనని పంతము పట్టియుండెను.

కాలక్రమమున డానేకు గుమారోదయమయ్యెను. ఆ బాలకుని సౌందర్యమును నొక్క అక్రిసియసును విడిచి, సర్వప్రపంచమానవులయు, గనికరము, గనికరము నాకర్షించుచుండెను. అక్రియసు రక్తకణములయందు కనికరమునకు చావులేకుండెను. అతడు తల్లిబిడ్డల నొక కరండమున బంధించి సముద్రమున విడిచివచ్చెను. ప్రేక్షకుల గుండెలు గరిగి నీరయ్యెను గాని యా కఠినాత్ముని చిత్తమున జాలివొడమదాయెను.

దైవప్రేరితమగు సుఖవాత ప్రసారమువలన నా పేటిక వార్ధితరంగములపై దేలియాడుచు దవ్వుదవ్వునకు బోవుచుండ నా పసిబాలుడు తల్లి యురస్థ్సలమున సుఖముగా నిద్రించెను. ఆబీదరాలికంటికి నీరమేగాని నిదుర రాదయ్యెను. అయినను రాచబిడ్డయగుటచే ధైర్యముగోల్పోవక, పసిబాలుడాలకించునట్లు మధుర గీతికల నాలపించుచుండెను. కొంతదూరము పోవుచుండ, చుట్టును వార్ధితరంగములును తెమ్మెర తెరలును పైన నాకసముగాని తల్లి బిడ్డల కన్యశరణ్యము లేదయ్యెను. కాని వారి పుణ్యవశమున, తరంగములు శాంతరంగములై యుండెను. పారపదము ధవళిమాస్పదమై యుండెను. వాయు ప్రసారము పూర్వవ సారమైయుండెను. ఇదియంతయు గాల పురుషుని సహజశీలమై గనుపట్టెను. అదివసంతసమయము. హాల్సియన్ సీక్సులు కులాయములనల్లి, సంద్రమున దేలియాడ సుఖవిహారము సల్పుకాంత దినములు.

హాల్సియన్ సీక్సుల వృత్తాంతములు తల్లిబిడ్డల ప్రస్తుత పరిస్థితిని చదువరులకు విశదము సేయగలవు. హాల్సియను సాగర తటీకామినికిని, వాయుపూరుషునకును జనించిన యొక దేవకన్యక. ఆమె యొక బాలనావికుని వరించి ప్రేమ వివాహమును జేసికొనెను. సీక్సునౌక బీటువారి విచ్ఛిన్నమయ్యెను. అతడు తీరమునకు జేరకమున్న, తరంగములచే మ్రింగబడెను. హాల్సియను సముద్రములోని కుటికి మనోనాధుని రక్షించుకొన యత్నించెనుగాని యామె ప్రయత్నము సఫలముగాక పోయెను. అమరులు వారి దుర్గతి నవలోకించి, కనికరము

భూని, వారినిరువురను సముద్రవిహంగములనుగాఁజేసిరి. అవి ప్రతి సంవత్సరమునను వసంతసమయారంభమున గులాయి ములగట్టి, వానిలోఁగూరుచుండి నిర్భయముగా గ్రీసు సముద్రమున విహారము చేయుచుండును.

రెండురాత్రులును రెండుబవళ్ళును గడచిపోయెను. పసికూన నిదురించుచునేయుండెను. ఆసుసుకోమలి యేడ్చి యేడ్చి యాకలిగొని బలమొడిసొమ్మసిలి తనబుగ్గను బాలుని పాలబుగ్గ కానించి, యట్లే నిదురచెందెను. పేటిక యట్లు కొంతదూరము పోయిపోయి యొక శిలామయ తీరమునకు జేరెను. గాడ్పువిసరునఁ గరండము రాళ్ళకుదాకి ధ్వనించెను. పెట్టెమోఁతకు రాజపుత్రిక యాకస్మికము నిదురమేల్కాంచి లేచికూర్చుండి తీరమువంక జూచెను, రాతిగుట్టలును, రాళ్ళ, బగులగొట్టువారును నామె కన్నుల కగపడనాయెను. ఆమె తన గేల్లవను జప్పళించి, పైకెత్తి తీరస్థుల సాహాయ్యము కొఱకు బిగ్గఱగానార్చెను. రాళ్ళపైనుండి, యొక యాజాను బాహుపురుషుడు జలతరంగముల నూగాడు పేటికను, పేటికాంతర్గతయగు పసిబిడ్డతల్లిని, నాలోకించెను.

ఆదయాళువు కేలనొక జాలముండెను. భుజమున నొక బుట్ట వ్రేలాడుచుండెను. దానే యాతని స్వరూప గాంభీర్యమును జూచి యతడు సాధారణ మానవుడు గాడని గ్రహించెను. వెంటనే యాదయామయుడు, నీటెయొద్ది రాతిపై కుటికి తన చేతనున్న వల నాకరండముపై విసరెను. పేటిక యొద్దునకు వచ్చెను. దీర్ఘబాహువు, రాజపుత్రిక జేయిపట్టు

గొని యొడ్డునకు జేర్చెను. పసిబాలుని భుజముపై బండ బెట్టుకొని యాతని వీపున నల్లన దట్టుచు, రక్షకునివంక జూచి “అయ్యా! నీకు గృతజ్ఞతాభివందనమనెను. అంత నారాజపురుషుడు “సుందరాంగీ! ఇట్టి ప్రాణాపాయకరమైన నావగాని నావలోనెక్కి సాహసించి యీద్వీపమునకు రాఁగారణమేమి? నీవెవ్వరవు? ఎక్కడనుండి బయలుదేరివచ్చినావు. వాస్తవముగ నీవొకరాజకుమారివి. ఈపసిబాలుడు మానవాతీత లక్షణములు గలవాడు. మీవృత్తాంతమేమి”యని యడిగెను.

“డానే” యాలిక శీర్షమువంచుకొని, దుఃఖించుచు, “అయ్యా! దురదృష్టవంతురాలనైన నేనే ప్రదేశమునకు జేరితినో చెప్పుము. నేనెట్టిమానవుల మధ్యబడితినో తెల్పు”మని దైన్యముతో వేడెను. “ఈదీవి సెరిఫాస్ అని పిలువబడుచున్నది. నేను హెలెన్ జాతీయుడను. నేనిందే నివసింతును. ఈద్వీపమున కధీశ్వరుడగు పాలిడెక్టెసు నాసోదరుడు. నేను తీరమున వలలవిసరి మత్స్యములను బట్టువాడనగుటచే, జనులు నన్ను డిక్టిస్ జాలరి యని బిలుతురు.” అని ప్రత్యుత్తర మొసంగెను. అంతనారాజ పుత్రిక యతని పాదములముందు వ్రాలి నమస్కృతిసేసి, “అయ్యా! క్రూరవిధి నన్ను మీగడ్డకు జేరఁ బారవైచినాడు. ఈయాగంతుకురాలిపై గనికరమూనుము. మీగేహమున నొక సేవకురాలివలె నివసించుటకు నాకనుజ్ఞ యొసంగుము. కాని నన్ను గౌరవదృష్టితో జూడ వేడెదను. నేనొకప్పుడు రాజకుమార్తెనై యుంటిని. నీకింతకు మున్ను చెప్పినట్టు లీబాలుడు సాధారణజాతి సంభవుడుగాడు

నేను నీకు భారమగునట్లుగా జీవింపను. సోమరితనముతో కూర్చుండి నీసొమ్మును వ్యర్థముగా దిను దాననుగాను. నేను నేతపనిలో నసమానమైన నేర్పరితనము నార్జించితిని. వస్త్రాంచలముల యందు నలంకార ప్రాయములగు చిత్రముల నల్ల నేర్చితిని. కుట్టున గాని యల్లికల యందుగాని మాదేశమున నొక్క కన్యకయు నాకంటె నధిక కౌశలముజూపి యుండ లేదు." అని చెప్పి మఱియునేమియో భాషింప నుంకించెను. అట్టితఱి డిక్టిస్ ఆమెమాట కడ్డమువచ్చి, "కుమారీ! నేను వృద్ధుడను. నాకేశజాలము తెల్లపాఱినది. నాకును త్సాహము కలుగజేయుటకు సంతానములేదు. నావెంటరమ్ము. నీవు నాకును, నాయర్ధాంగికిని బిడ్డవుగా నుండుము. ఈ పసివాడు నాదౌహిత్రుడని భావింతును. నేను దేవభీతి గలవాఁడను. ఆగంతుకుల కందఱికిని, నాతిథ్యము నొసంగుచుందును. సద సత్కర్మములు ఫలితములుఁ తప్పక కర్తల ననుభవింపజేయును." అని సాదరముగ బల్కెను.

ఇట్లు దానే, జాలరియగు డిక్టిస్‌చే నోదార్చబడి, యతని గీమునకు బోయి యాజాలరి దంపతులకు కుమార్తెగా నుండి పదునైదు సంవత్సరములకాలము గడపెను.

---

# వీరపురుషులు

## పర్సియసు

## రెండవ భాగము

## పర్సియసు అనాలోచితముగ తీవ్రశపథము చేయుట

పదియేను సంవత్సరముల కాలము గడచెను. చిన్ని బాలుడు దీర్ఘకాయముగల బాలుడయ్యెను. వాణిజ్యనౌకలలో సమీప ద్వీపములకు ప్రయాణము సేయుచు నౌకనావికుడయ్యెను, తల్లి యతనికి పర్సియస్ అని పేరుపెట్టెను. ప్రజలాతని మర్త్యకుమారుడు కాడనియు, అమర్త్యుల కధిపతియైన జీయస్ పుత్త్రుడనియు, భావింపసాగిరి. అతడు పదునైదేండ్ల ప్రాయమువాడైనను సామాన్యమానవులకంటె దొమ్మిది యంగుళము లెక్కువ పొడవుగా నుండెను. పరుగెత్తుట, కుస్తీపట్లుపట్టుట, పిడికిళ్ళతో పోరుట, గుండ్లు విసరుట, నావ నడుప దెడ్డువైచుట, గానపేటికను వాయించుట మున్నగు నన్నివిద్యలయందును నద్వితీయుడనిపించుకొనెను. ఉత్తమమైన దీక్షను శిక్షణముక్రింద, సత్యశాంత ధైర్య గాంభీర్యాది మర్యాదాదిలక్షణముల నార్జించెను. దానేయిప్పుడొక విపత్తు

నెదుర్కొన వలసివచ్చెను. తల్లి గౌరవమును కాపాడుకొన వలసిన బాధ్యత పర్సియసుపై బడెను.

డిక్టిసునకగ్రజుడగు పాలిక్టిసు సెరిఫోస్ ద్వీపమున కధిపతియై యుండెను. డిక్టిసువలె నతడు ధర్మమార్గావలంబి గాడు. అతడత్యంతక్రూరుడు. అత్యాశాపరుడు. [illegible]మారి. దానేయొక్క సౌందర్యాతిశయమును జూచి, మోహపర వశుడై యామెను వివాహము సేసికొనదలంచెను. కాని యా రాజసాధ్వి కట్టితలంపులేదు. ఆమెకు దన సుమారుని యందును, నతనితండ్రి యందును గాక మఱియెవ్వరి యందును ప్రేమ భావములేదు. తన భర్త తిరిగి తన్ను జూడవచ్చునను నాశయు నామెకు లేదు.

కొన్నినాళ్ళకు ద్వీపాధిపతి చిత్తము మదన వేదనా పీడిత మయ్యెను. ఒకదినము పర్సియసు సముద్రయానము సేయబోయెను. అత్తఱి నతడు దానేనొకదవ్వుతావునకు బిలి పించుకొని "నీవు నాకు భార్యవగుము. కానిచో నిన్ను నా దాసిగా జేసికొనియెద" నని కఠినముగా బల్కెను. ఆరాజ సాధ్వి యందుల కొడంబడలేదు. ఆమఱునాటి నుండి యా మెచే దాస్యము చేయింప నారంభించెను. బావులనుండి యామెనీరు తోడి తెచ్చుచుండెను. విసరురాతిచే బిండి విసరు చుండెను. సంకెలలు వేయబడెను. తీవ్రముగా గొట్టించబడు చుండెను. పర్సియసు సేమాస్ దీవిలో దిరుగాడుచుండుటచే దల్లి కష్టము లాతని చెవులబడకుండెను.

ఒకనాఁడు ఓడ రేవుననుండఁ బర్సియస్ తీరసమీపమున నున్న గొప్ప కయుఁడవికిఁబోయి పచ్చికబయలుపై నిద్రించు చుండెను. అతనికొక స్వప్నమయ్యెను. ఆస్వప్నమున నతని కొకసుందర స్త్రీస్వరూపమగపడెను. ఆమెకనుదోయి మహా ప్రకాశమానముగనుండెను. చూపు మృదువుగను శాంతము గను నుండెను. ఆమహాశక్తి శీర్షమున గిరీటమును, హస్త మున నొకబల్లెమును విరాజిల్లుచుండెను. తేజోవంతమైన కవచముదాల్చిన చర్మమొక్కటి యాదేవియంసపీఠమున నలరుచుండెను. ఆమొగ్గృష్టి నిశ్చలముగానుండెను. పర్సియసు హృదయాంతర్గత సర్వరహస్యములను నాపెయెఱింగియున్న ట్లుగ ప్రవర్తించుచుండెను. స్వప్నమందైనను బాలకుడామె వంకఁజూడజాలక కన్నులుమూసికొనెను. అప్పుడాదేవి బాలు నితో నిట్లనెను.

"పర్సియస్ కుమారా ? నీవునాపక్షమున నొక కార్య మును సాధింపవలసియున్నది."

"అమ్మా ! నీవెవ్వరవు ? నా పేరు నీకెట్లు తెలిసినది ?"

"ఓయీ ? నేను పల్లాస్ఎథీనును, నేను మానవహృద యములనుండు సర్వభావములను నెఱుంగుదును. మానవుడు పౌరుషశాలియో లేక పిఱికిపందయో నాకుదెలియును. జీవులు రెండువిధముల వారుందురు. మట్టివలె తేజోహీనములైన యాత్మలుగలవారు కొందఱుందురు. అట్టివారు నాచేదీవింప బడరు. అగ్నివలె తేజోవంతములైన యాత్మలుగలవారు కొందఱుందురు. అట్టివారునాకిష్టులు. వారిని నేనాశీర్వ

దింతును. పౌరుషవంతులగువారికి నేనధికబలమునిత్తును. శూరులగువారికి నేను వింతమార్గములనుజూపి, క్రూరమృగములు మున్నగువానితోడను, భగవదాజ్ఞలకును మానవధర్మసూత్రములకును విరుద్ధముగా సంచరించువారిని జయించి వధించుటకు, శక్తిసామర్థ్యముల నొసంగుదును.

"పర్సియస్‌కుమారా? ఈరెండు తెగలవారిలో నీవెవ్వరి నిచ్చగింతువో చెప్పుము."

"శూరులశాఖయే నాకిష్టమైనది"

"శూరులలోకొందఱు తమతమ యౌవనప్రాయము ననే జీవముల గోల్పోవుదురు. కొందఱు ఘనమైనకీర్తినార్జించి గొప్పగౌరవమునకు పాత్రులగుదురు. చిరకాలముదనుక యశస్వులై జీవింతురు."

"గొప్పయశస్సునార్జించు ప్రయత్నమునందు యౌవన మధ్యమునజచ్చినను చింతలేదు. ప్రజాభిమానమును చూఱగొనక, ప్రజలచే ప్రేమింపబడక, నిరర్థకముగా జీవించుటకంటె, యశస్సుకొఱకుబోరాడి, యౌవనమునజచ్చుటయే శ్రేయస్కరము."

పర్సియస్ చెప్పిన యీవాక్యము నాలకించి మినేర్వ, తన లోహమయకవచమును పైకెత్తి యతనితో నిట్లనెను. పర్సియస్ బాలకా! నిటుచూడుము. నాకవచముపై గనంబడుచున్న ఘోరక్రూరమృగమును నీవు చంపగలవా? దానితలను నేనీకవచముపై నుంచుకొనగలను?"

అత్తరి కవచముపైనున్న యద్దములో నొక ముఖమగపడెను. దానిని జూచి పర్సియసు విభ్రాంతి చెందెను. అదియొక సుందరాంగి ముఖము. దాని గండభాగములు కళాహీనములై యుండెను; కనుబొమలు బాధాబద్ధములు. పెదవులు పాపపెదవులవలె విషమయములు నాలుక సాచిన పాములే పెంటుకలవలె గండ భాగములపై వ్రేలాడుచుండెను. రాబందు రెక్కలవంటి రెక్కలు తలపై జుట్టుకొని యుండెను. వక్షస్థలమ్మున నిత్తడి పంజాలుండెను.

పర్సియసు ఆవికృతాకారమును శ్రద్ధగా సమీక్షించి, "ఇట్టిభయంకర దుష్టజీవి ప్రపంచకమున నెందున్నను వెదకి చంపుట యొక ఘనమైన సాహసకృత్యము. దానిని నేనెక్కడ గనుగొనగలను" అని యా దేవతనడిగెను.

అందులకామె చిఱునగవునవ్వి, "నీవు మిక్కిలి చిన్నవాడవు. అత్యంతావసరమైన చాతుర్యము నీయొద్దలేదు. ఇది క్రూర దుష్ట జీవులకు దల్లియైన మహారాక్షసి. దీనిని మెడుసా యందురు. ప్రస్తుతము నీవింటికి బోయి నీకృత్యమును సావకాశముగా నిర్వహించుచుండుము. నీకృత్యమున నీవు తగు సాహసమున నిర్వహించితివేని నిన్నీరాక్షసిని జంపుటకు బంపుదును." అనిపల్కి యదృశ్యమయ్యెను. పర్సియసు అంతలో నిద్రమేల్కొనెను. పర్సియసు అదియొక స్వప్నమని తలంచెను గాని, యారాక్షసి ముఖము అతని కన్నులలో నెల్లప్పుడును నాడుచుండెను. అంతట నతడు గృహోన్ముఖుడై ప్రయాణము చేసెను.

పర్సియసు ఇంటికి బోవునఱకు తనతల్లి పాలిడెక్టిస్ యింటిలో దాసిగాజేయబడినదని వినెను. వెంటనే యతడా సౌధమున నన్నిగదులయందును తల్లికొఱకు వెదకులాడెను. కొంతసేపటికి విసరురాతియొద్ద గష్టముసేయుచున్న కన్నతల్లి యాతనికగపడి, హృదయమును గలంచెను. దుఃఖపడుచున్న యామె కన్నీరు దుడిచి, తన వెంట నడువుమని పర్సియసు తన తల్లిని గొంపోయెను. రాజు వారిపైకివచ్చి యాగ్రహముతో దూషించెను. అంతకుమున్నే భయంకరాకృతితో కన్నుల వెంట నిప్పులుగ్రక్కుచున్న పర్సియసు రాజును జూచి "ఓరీ! దుష్టద్వీపాధిపతీ! దేవతలకును ఆగంతుకులకును, అనాధల కును నీవు చూపుచున్న మర్యాద యిదియేనా? నీవు జూపు కనికరమిదియేనా?" యని పర్సియసు తనకత్తికొఱకు వెదకు కొనెను, శస్త్రము దగ్గరలేనందున నతడా విసరురాతిని గేలం బట్టుకొని పాలిడిక్టిసు తల వ్రియ్యలుసేయుటకు సిద్ధపడెను. కాని దానే యాతనికడ్డుపడి, "మనము నిస్సహాయులమైన యాగంతుకులము, రాజానుజంపిన బ్రజలు మనలను బ్రతుక నీయరని చెప్పి యతనిని వారించెను. అంతలో నాయులజడి విని డిక్టిసు పఱువెత్తివచ్చి, కుమారా! నిన్ను నేనుబోషించు చున్నాను నామాటయందు గౌరవముంచి నాయన్నకు హాని సేయకుమని బ్రతిమాలి యాతని శాంతపఱచెను.

పర్సియసు శాంతపడి తల్లిని మెనీర్వాదేవాలయమునకు దీసికొని పోయెను. అచ్చటిపూజారిణి "దానే"ను ఆలయము శుభ్రపఱచు నొక సేవకురాలినిగా నియమించెను. పర్సియసు,

డిక్టిసు ఇగాపుగాను నామెను దినదినమును జూచుచు క్షేమ విచారము సేయుచుండిరి. దేవాలయ సేవకురాలైన "దానే"ను నిర్బంధించుటకు పాలిడిక్టసు జంకినందున, నామె, సురక్షితముగా ప్రొద్దుగడపుచుండెను.

దుష్టుడైన ద్వీపాధిపతి పర్సియసు నెట్లైన ద్వీపమునుండి వెడలఁజేసి, యతనినిర్బంధింప సంకల్పించెను. ఒక దినమునఁ దనయింట నొక పెద్దవిందు కాగలదని ప్రకటించి, ప్రజల నాహ్వానించెను. విందుదినమున సర్వసామంతులును, నెల్లప్రజలును సమయోచిత శక్తిగొలది రాజునకు గానుకలను గైకొని వచ్చిరి. పర్సియసు నిర్ధనుడగుటచే రాజునకు సమర్పించుటకు నేమియును తీసికొని రాలేకపోయెను. అప్పుడు ద్వీపాధిపతి. "పర్సియసూ! అందఱును కానుకలర్పించిరి. నీకానుక యే"దని యతని కవమానము గలుగునట్లుగా బ్రశ్నించెను.

పర్సియసు రోషపడి "ఇవియన్నియు బహుమతులా? వీనిబహుమతులకంటె గొప్పవిలువగల బహుమతిని దెచ్చి యిచ్చెదను. చూడుమని" పంతముతోఁ బ్రత్యుత్తరమిచ్చెను. ఆసమయమున పర్సియస్ చిత్తమున, నతనికి సేమాస్ దీవి యందున్న స్వప్నమున దృశ్యమైన రాక్షసిశీర్షము స్ఫురించెను. పర్సియసు సభామధ్యమునను నిలిచి యెలుగెత్తి "ఇచ్చటిజనుల కందఱకును సాధ్యముగాని "మెడూసారాక్షసియొక్క శిరస్సును దెచ్చియిచ్చెద"నని శపథముసేసెను.

పాలిడిక్టసు మంచితరుణము సంఘటించెనని సంతసించి "మంచిది. ఆరాక్షసిశిరస్సును దెచ్చునంతవఱకు నిచ్చటికి

రాకుము. పొమ్ము" అని యానతిచ్చెను. మాఱుమాటాడక పర్సియసు మహాగ్రహముతో పండ్లుకొఱుకికొనుచు రాజసన్నిధిని విడిచి, సూటిగా. సముద్రతీరమునకుఁబోయి, యచ్చటి శిలలలో సంచారము ప్రారంభించెను.

పర్సియసు తుదకొక స్నిగ్ధశిలాతలమున గూర్చుండి, పల్లాస్ యెథీనును మనసారధ్యానించెను. ఆ దేవి వెంటనే మేఘములలోనుండి బయలువెడలి, వచ్చి బాలవీరునిమ్రోల నిలువబడెను. ఆమె దేవతలసందేశహారియగు హెర్మీసును వెంటగొనివచ్చెను. హెర్మీసుచేతిలో నొకవజ్రసంఘటితమగు నొకవజ్రదండముండెను. అతనిపాదములయందు పైడిపాదరక్షలుండెను. వాటిమడిమెలయం దిరుదెసలకు జీవములగు పక్షములుండెను. పర్సియసు వారినిజూచి, వారమర్త్యులని గ్రహించి, శిరమునేలమోపి నమస్కరించి, భక్తితో కేలుమోడ్చి నిలువబడెను.

పల్లాస్ఎథీను తొలుదొల్త "బాలకా! భయపడకు" మని ధైర్యముచెప్పెను. మఱియు, "కుమారా! నీవు పాలిడిక్టసును ధైర్యముతో దగురీతి నెదుర్కొంటివి. ఇఁకనీవు రాక్షసిశిరస్సును సాధించవలయు"నని పల్కెను.

పర్సి—"లోకమాతా? నీవుస్వప్నములోఁ గనబడుట యాదిగ నాయందొక క్రొత్తజీవముగలిగినది. ఏసాహసకృత్యమైనను సాధింపకుండుట నాకవమానకరము. కావున నేన క్కార్యమును సాధించుమార్గమును జెప్పుము"నెను.

[illegible]—"బాలకా ! నామాటలు శ్రద్ధతో వినుము. మఱచినచో నీవుసహజముగా మరణించెదవు. ఇటనుండి నీవు హైపర్ బోరియా దేశమునకు బొమ్ము. అది యుత్తరధ్రువమున కావలనున్నది. అందు వెదకినచో ఏకగర్భజనితలగు ముగ్గురుస్త్రీలు నీకగపడుదురు. ఆముగ్గురకును నొక్కకన్నును, నొక్క పన్నును మాత్రముండును. సంధ్యాతారకుమార్తెలగు దేవకన్యకల యావాసమెచ్చటనని వారినడుగుము. ఈదేవకన్యకలు పశ్చిమ అట్లాంటిక్ ద్వీపమునగల కాంచనద్రుమ ఛాయలయందు నాట్యములు సేయుచుందురు. ఈకన్యకలు నీకు మెడుసారాక్షసి యుండుతావునకు దోవచెప్పెదరు.

నాకు శత్రువగు ఈరాక్షసాంగన పూర్వమున నొక చక్కని కన్యకయైయుండెను. ఒకఘోరాపరాధము చేసి శపింపబడి, సర్వహింతకజంతువులకు దల్లియగు రాక్షసిగా రూపొందెను. ఆమె కేశములు పాములుగను, చేతులు పక్షిరాజు పంజాలుగను, పెదవులు విషపూరితములుగను, హృదయము ఆగ్రహావమానములకు తావలముగను, సృజింపబడెను. ఆమె కనుచూపు ప్రేక్షకులను శిలాస్వరూపములనుగా మార్చివేయును. రెక్కల గుఱ్ఱమును సర్వశస్త్రధారియగు రాక్షసుడును నామె సంతానము. ఎజీడ్నాయను మాంత్రికురాలును, గేరణ అను మూడుతలల హంతకురాలును నామెకు మనుమ

రాండ్రు). సముద్రరాజ్ఞికుమార్తెలగు స్త్రీలో, యుక్తైటులకు మెడూసా సోదరియయ్యెను. వారినెవ్వరిని నీవు ముట్టవలదు. వారు మర్త్యాతీతలు. మెడూసా శిర్షమును మాత్రము నాకు దెచ్చియిమ్ము."

పర్సి—"దాని దృష్టిని దప్పకొనుటయెట్లు? అదినన్ను శిలగా జేయదా?"

ఎథీన్—"భయపడకుము. ఈ మెఱుగు కవచమును గొమ్ము. నీవారాక్షసిగయొద్దకు బోయినప్పుడు దానివంక జూడక, దాని ప్రతిబింబము నీమెరుగుకవచమున జూడుము. దానికంఠమును సులభముగా నఱుకగలవు. పెడమొగముబెట్టి శిరస్సు నీకవచముపైని మేకచర్మములోపెట్టి చుట్టుము. అట్లు చేసిన నీవు దానిని సురక్షితముగా దెచ్చియీయగలవు."

పర్సి—మంచిది. నేను నౌకలేక సముద్రమునెట్లుదాటగలను. దాని దేహము లోహమయమైనచో దానిమెడ నఱుకుట యెట్లు?"

ఆమాటవిని యామెప్రక్కనున్న దేవసందేశహారి, హెర్మిసు "వీరబాలకా! ఈపైడి పాదరక్షలగొమ్ము. దీనికి ఱెక్కలున్నవి. నీవాకాశమార్గమున నెగిరిపోగలవు. ఈ నా దేవఖడ్గమును గొమ్ము. దీనితో నీవొక్క దెబ్బకే దాని కంఠమును దెగవేయగలవు"

అని పల్కి యూ రెంటిని వానికిచ్చెను.

పర్సి—"నేను నాతల్లికిని డిక్టిసునకు జెప్పి వారియనుజ్ఞ దీసికొని పోవలయునా ?"

ఎపీఁ—"వలదు. వారు దుఃఖింపగా నీవు ధైర్యము గోల్పోదువు."

పర్సి—"దేవనిత జీయసు నారాధించి యతనికి నైవేద్యము పెట్టి యనుజ్ఞగొని పోవలదా ?"

ఏపీ—"నీవు తేనున్న మెడుసా శిరస్సేవారికి నైవేద్యము. మఱియేమియు వలదు. త్వరసేసిపొమ్ము." అంత పర్సియస్ రాతిపై నుండి పైకెగిరి యాకసమున దేలి ప్రయాణము చేసెను. ముక్కుసూటిగా నుత్తర దిఙ్మార్గమున నతి వేగమున, ధైర్యోత్సాహములతో సాగిపోవుచుండెను.

---

# వీరపురుషులు

## పర్సియసు

## మూడవభాగము

## పర్సియసు మెడూసారక్కసిని జంపుట.

బంగారుపాదరక్షల ప్రభావమువలన పర్సియసు గమన వేగము విహగరాజు గమనవేగము నతిశయించెను. సైత్నసు, సియాన్, అత్రీకా, ఎథెన్సు, థెబిస్ దీవులమీదుగాబోయి, యొక్కజాముకాలముననే, కోపేయిక్ సరస్సును, సెఫీసస్ లోయను, ఓటా, పిండీస్ పర్వతాగ్రములను దాటి, థేసేలి యన్ మైదానముల నతిక్రమించి, ఉత్తరమహారణ్యముల పైకి జేరెను, ఈస్టర్ ప్రవాహమును మైదానములనుదాటి నిరా కార భూమిపైనికేగి, తరువాత నొకయనామక ప్రదేశమునకు బోయెను. దానిలో ననభివర్ణ్యమానమైన యొకత్రోవ వెంట నతడు ఏడుదినములునడచెను. తుదకొక హిమమయ ప్రదేశ మునకు జేరెను. అచ్చటిమంచు సముద్రముతీరమున, గ్రేసహో దరీమణులను గనుగొనెను. ఆసమయమున సనాతనకాల ప్రాశ స్త్యమునుజెప్పు నొకగేయమును బాడుచుండిరి. "మాతలారా మీరుసర్వమును దెలిసినవారు, మెడుసారాక్షసి యుండుతావు నకు నాకుత్రోవఁజెప్పుడని యడిగెను, వారుముప్వురకును నొకేకన్నగుటచే నొకరియొద్ద నొకరాకన్నునడిగి తీసికొను

చుండిరి. అనుసమయమున నతఁడు తనచేయిని ముందుకుజాచెను. వారిలో నొక్కతె ఆచేయి తమసోదరిచేయియనుకొని కన్నును పర్సియస్ చేతిలో నుంచెను. పర్సియస్ దానిని జేతనుంచుకొని గ్రయాణులారా మీకన్ను నా చేతఁజిక్కినది. రక్కసియొద్దకుబోవు నిజమైనత్రోవ చెప్పెదమని ప్రమాణము సేసినంగాని మీ కన్నును మీకీయజాలననెను. సోదరీమణులు ఎలుగెత్తి యేడ్చిరి. ఇటనుండి దక్షిణముఖముగాబోయి, ఎట్లాస్ రాక్షసుని నిలయమునకు జేరుము. అతడు భూలోకస్వర్గలోకములను విడఁబట్టియుండును. హెస్పెరైడులను నతనికుమార్తెల నడుగుము. ఆమె నీముందుత్రోవనుజెప్పును. మాకన్నును మాకొసంగుము. పైత్రోవవిషయము మాకుజ్ఞప్తియుండ లేదు." అని తెల్పిరి.

పర్సియస్ వారికన్నును వారికిచ్చివేసెను. వారా కన్నునుదాల్చక గాఢముగానిద్రించి మంచుగడ్డలుగా మారిపోయిరి. వీరయువకుడు హిమవత్ప్రాంతముదాటి, అట్లాస్ రాక్షసుడుండు పర్వతమువంకకు పయనముసాగించెను. అచ్చట భూమిమీదకుదిగి మనోహరగిరి మధ్యప్రదేశములను, జలధారలను, పూవులతీవెలను, గాంచి యానందించెను. కొంతతడవునకు మనోహర మధురగానము లాతనిచెవింబడెను. దానిని బట్టి సంధ్యాతారపుత్రికల కేళీవనమునకు జేరితినని గ్రహించెను. వారిగానముల నించుకతడ వాలకించెను. కొంచెము ముందునకుఁబోయి వారినృత్యవిలాసముఁ గుజూచి హర్షించెను

కొంతసేపటికి వారు పర్సియసు వంకజూచి "నీవెవ్వ

రవు ? మాతోటను దోచుకొని, మాబంగారు చెట్టు పండ్ల నెత్తుకొనిపోవ నరుదెంచిన హెర్క్యులస్ వీరుడవా ? ఏమి ?" యని యడిగిరి.

"నేను హెర్క్యులసునుగాను. నాకు కాంచనఫలము లక్కఱలేదు. నేను మెడూసా రాక్షసిని జంపుటకువచ్చినాను. అదియుండు తావునకు నాకు ద్రోవసూపుడు."

దేవకన్యకలు—"సుందరాంగా కొంచెము నిలువుము. మాబూతోటలోని మలయమారుతమును, శాంత రవి కిరణ ప్రసారమును నానందదాయకములు. ఈసువర్ణవృక్షచ్ఛాయల యందు మాతోడగూడి యించుక తడవు నృత్యము సేయుము. వేయిసంవత్సరములనుండి మేమిచ్చట నృత్యము సేయుచు ప్రియసఖునికొఱకు ఎదురుచూచుచున్నాము. రమ్ము రమ్ము."

పర్సి—"కన్యకలారా ! నేను మీతోగూడి నర్తనము సేయుచు, నన్నుబంపిన దేవతలయాజ్ఞను నెఱవేర్పక యూల సించితినేని, నాకు ముప్పుగలుగును. మెడూసాగార్గను యొద్దకు బోవు త్రోవను జెప్పుడు. లేనియెడల నేనీప్రాంతమెల్లదిరిగి సముద్రతరంగములలో నంతరింతును."

అదివిని యాకన్యకలు దుఃఖించి కన్నీరుగార్చిరి. దీర్ఘ నిశ్వాసములవదలుచు "అయ్యో ! మెడుగా గార్గనా ? అది నిన్నొక గండశిలగా మార్చివేయునుగదా ?" యనిరి.

"చావడిలోని యెద్దువలె నిరర్థకముగా చిరకాలము జీవించుటకంటె వీరమరణము నొందుట శ్రేయస్కరము.

దేవతలు నాకాయుధములనిచ్చిరి. దానిని జంపు నుపాయము నాసమయమున జూపగలరు.”

“నిర్భయుఁడవకదా? నీవు మృతినొందుటకు సిద్ధపడితివేని యట్లేకానిమ్ము. ఆత్రోవమాకు దెలియదు. మాతండ్రియగు సంధ్యాతారకు సోదరుడగు అట్లాసుయొద్దకు నడువుము. అతడు నీకాత్రోవను దెలుపగలడు.” అనిపల్కిరి.

పర్సియసు వారందఱును, మోకాళ్ళపై నిల్చి భూమ్యాకాశములను భుజమువేగా నుంచి మోయుచున్న అట్లాసు రాక్షసునిజేరి, మెడూసాయొద్దికి త్రోవ జెప్పుమనిరి. అంత నా అట్లాస్ రాక్షసుడు చేయిచాచి చూపుచు, “అదిగో, నాకగపడుచున్న యాదూరస్థద్వీపమునసే యా (గార్గన్సు) రాక్షసు లుందురు, కాని, చీకటి టోపీని ధరించినగాని యీ యువకు డచ్చటికిఁ జేరఁజాలడు. చీకటి టోపీని ధరించిన వారిని, ఇతరులు చూడలేర”ని చెప్పెను.

పర్సియస్—“ఆటోపీ ఎచ్చటనున్నదో తెల్పుము. నేను దానిని సంపాదించుకొనియెదను.”

అందులకట్లాసు మందహాసముసేసి, “అది మృతజీవులుండు నరకప్రదేశమున నుండును. సజీవులెవ్వరును నాటోపీని గనుగొనజాలరు. నాయన బిడ్డలు దేవాంశ సంభూతలు. నీవు నాకొక వాగ్దానముచేసి, విశ్వాసముతో నుండెదనంటివేని, వారు దానిని దెచ్చియిచ్చెదరు. ఆటోపీతో నీకు గార్యసిద్ధి కాగలదని పల్కెను,

పర్సియస్ అందులకు సమ్మతించి "నీ కేమికావలెనో చెప్పు" మనెను.

"నీవు రాక్షసిని జంపినపిమ్మట దానితలను గోసి తెచ్చుకొని, మఱలిపోవునప్పుడు దానితలను నాకు జూపవలెను. దానిని చూచినవెంటనే; భూమ్యాకాశములను విడివిడిగా మోయవలయునను విధినాకు దప్పును. అప్పుడు నేనొక శిలగా మాఱిపోవుదును. అంతటితో నాబాధ తొలంగును."

పర్సియస్ ఆప్రకారము వాగ్దానము చేసెను. దేవకన్యకలలో జ్యేష్ఠురాలు, శిలాసముచ్ఛయము పడియున్న గొప్ప చీకటి గుహలోనికి బోయెను. నరకముయొక్క ఆముఖద్వారమునుండి పొగయు నుఱుముల ఘోరారావమును బయలుదేరెను. మిగిలినవారు ద్వారమున గాచుకొనియుండిరి. ఏడు దినములు ముగిసినతరువాత, నా దేవకన్యక నరకద్వారమునుండి బయలువెడలెను. ఆమెచేతిలో నాచీకటి కుళ్ళాయి యుండెను. దేవకన్యకలతని కొఱకు చాలసంతాపపడి యతని కరపద్మంబుల ముద్దుపెట్టుకొని, విచార ముఖములతో నా కుళ్ళాయి నతని శిరస్సుననుంచిరి. వెంటనే యతడదృశ్యుడయ్యెను.

ప్రయాణము సాగించి, పోయిపోయి, పర్సియసు మెడూసా ఱెక్కలధ్వని వినవచ్చిన తావున దూరమున నిల్చెను. ఎథీను చెప్పినమాటలను స్మృతికి దెచ్చుకొనెను. ఎథీనిచ్చిన కవచమును పైకిబట్టి, గాలిలోని కెగిరి, క్రింది భాగముననున్న సర్వస్వమును, కవచపు టద్దములో జూచెను.

అక్కచెల్లెండ్రను ముగ్గుర రాక్షసస్వరూపము లగపడెను. వారిలో మెడూసా ఎవ్వరో కనుగొనవలసివచ్చెను. కొంత సేపటికి మెడూసాఁ దెలిసి యటునిటు దిరుగాడగా అదృశ్యుడై యున్న పర్సియసు దాని సర్పకేశములను, లోహపు పంజాలను జూచి గుర్తించెను. అప్పుడతడు క్రిందికిదిగివచ్చి, తన కవచాదర్శమున రాక్షసి మేనెల్ల నవలోకించి, నిశ్శబ్దముగ సమీపించెను. అంత నతడు తన దేవదత్తసువర్ణఖడ్గముతో మెడూసా కంఠమును దెగవేసెను. ఒక్కదెబ్బకే దానిశిరస్సు విడివడియెను. తత్క్షణమే ఆవీరుడు పెడమొగము జేసికొని దాని శీర్షమును కవచముపైని మేకచర్మములో జుట్టి తీసికొని తటాలున పైకెగిరెను. అసామాన్యమైన వేగముతో నింటి దోవపట్టెను.

మెడూసా చెల్లెండ్రు కొంతసేపటికి దమయక్క నఱుకబడి యుండుటనుజూచి, నలుదిక్కుల పాఱజూచి పైకెగిరి ఎగిరి పోవుచున్న పర్సియసును జూచి వానిని వెంబడించిరి. మహారావములుచేసి వెంబడించు వారి నినాదములగాంచి, తన సువర్ణపాదరక్షలను ధ్యానించి నన్నతివేగమునే నడపుడని గోరెను. పర్సియసు గమనవేగమత్యధికమగుటచే రాక్షసీయుగ్మము వానిని గలిసికొనలేక పోయెను. క్రమక్రమముగ వారి యాగమననినాదములు శాంతించెను. పర్సియసు, తన

చేసిన వాగ్దానము ప్రకారము క్రమ్మఱ అట్లాసు నొద్దకువచ్చి మెడూసా శీర్షము నతనికి జూపెను. అట్లాసు శ్రీమదీర నొక శిలయై మేఘమండలమునకుఁ బై భాగమున శాశ్వతనిద్ర సేసెను.

పర్సియసు అంత దేవకన్యకల సందర్శించెను. వారతనిని దమయొద్దనేయుండుమని యెంతయో బ్రతిమాలిరి. అతఁడంగీక రింపక ముందుకోవ నడిగెను, కన్యకలతని కొక మాంత్రిక ఫలమొసంగి, దీనిని భుజింప నేడుదినములవఱకు నాకలిగా దని తెల్పి యాతని వియోగమున కెంతయు జింతసేసి దగ్గిఱ మార్గము జూపి సాగనంపిరి.

పర్సియసు వారుచూపిన మార్గమును గుర్తుంచుకొని, పర్వతాగ్రమునుండి పై కెగిరిపోవుచు క్రమక్రమముగానదృశ్యు డయ్యెను.

---

# వీర పురుషులు
## పర్సియసు
## నాలుగవ భాగము
## పర్సియసు ఎతియోపియన్ జాతీయుల యొద్దికి వచ్చుట



దేవకన్యక లొసంగిన ఫలమును దిని, పర్సియసు: ఆకలిబాధకు లోనుగాక, అధిక తేజస్వియై విశాలములైన సికతాప్రాంతములను, నరణ్యములను దాటనెగురుచు సిల్లీ పర్వతాలోకనము జేసి, యాప్రదేశమున నివసించు మరుగుజ్జు నీక్షించెను. ఒకప్పుడు వారుకొంగలతో మహాసంగ్రామము జేసిరి. వారి బల్లెములు రెల్లు దంట్లతో జేయబడినవి. కొంగ గ్రుడ్లడిప్పలతో నిర్మించబడిన వారి స్నిగ్ధభవనముల సమీక్షించి యానందపడి మందహాసము సేసెను. అచ్చటినుండి మధ్య సముద్రము దిక్కునకు బయనించెను. అత్తావున నతడు పెద్ద గాడ్పులతోవచ్చిన యిసుక తుపానులకు లోబడి యొకసారి వెనుకకు గొట్టుకొని పోయి మరల ముందుకువచ్చెను. ఇంత వఱ కేడు దినములు గడచిపోవుటచే. నతని కాళ్లదవ్వులు ప్రారంభమయ్యెను. పైనుండి చూచుటవలన, నప్పిగొన్న యతనికి, సూర్యకిరణ ప్రకాశితసికతాతలములు సరోవరముల

వలె నగబడుటచే, క్రిందికిదిగి వచ్చి, ఒకటి రెండుసారులు మోసపోయెను. ఎండమావుల వంచనకు సైపజాలక, దప్పి కోర్చుకొనజాలక, యొక్కపరి ఎథీను దేవతను ధ్యానించెను. సరియైన బాటజూపుమని వేడెను. అప్పుడాకస్మికముగా జల ప్రవాహ తరంగ నినాదములతని చెవులకు వినవచ్చెను. ఆ వాహిని దరి కేగి చూడ నొక పెద్ద ఖర్జూర వృక్షముల తోట యగపడెను. నిర్మలనీరమును ద్రావి దాహము నడంచుకొని, ఖర్జూర ఫలంబులచే నాకలిదీర్చుకొని, శ్రమదీర పచ్చగడ్డి మైదానముపై చెట్లనీడయందు కొండొక కాలము విశ్రమించెను.

పర్సియసు అప్పుడు పునరుజ్జీవితుడై, యాలోచించి, తూర్పుదెసగా ప్రయాణముసేసెను. ఇప్పుడతనికి, జలధారలు ఖర్జూరపుతోటలు, పచ్చిక బయళ్ళును క్రిందిభాగమున నగ పడజొచ్చెను. కొంతతడవున కతడు నైలుతరంగిణిని, ఐగుప్త దేశభాగములోని మనోహరోప వనములును గానవచ్చెను. మఱియు, దేవాలయముల శిఖరములు, నగరాంత స్సఖ మణి మయ స్తంభములు, మహోన్నత కుడ్యములును నగపడెను. జొన్నలు, రాగులు, మొక్కలు మున్నగుధాన్యముల కంకులు ధరించిన సస్యములుగల క్షేత్రము లతనికి గనులపండువుసేసెను. తత్ప్రాంతమున వినోదార్థమతడొక్కపరి గ్రిందిగిదిగి జన మధ్యమున నిలువ నెల్లరును నతని స్వరూపముజూచి యచ్చెరు వొంది ప్రశ్నలు వేయసాగిరి.

పర్సియసు ఆ ఐగుప్తదేశీయుల ప్రశ్నలకు జవాబు చెప్పుచు నిట్లు తెలియజేసెను. నేను అసురుడను గాను, నేను

హెలెక్ దేశవీరుడను. మెడుసారాక్షసినిజంపి దానితలను గోసికొని పోవుచున్నాను.” అ త్తటివార లానందపడి యతనికి గావలసిన యాహారాదులొసంగి కొంతతడవుంచి యుత్సవ ములు సేసిరి. వారతనిని రాజునొద్దకు దీసికొనిపోవగా, నత డిచ్చగింపక చీకటిటోపీసిబెట్టుకొని యదృశ్యుడై పైకెగిరి పోయెను. ప్రజలతని విగ్రహమునుజేయించి యారాధించు చుండిరి. అంతనతడు ఇస్త్రమస్ భూసంధిమీదుగా, కాపియన్ పర్వతాగ్రమునుజేరి, సెర్బోనియర్ జలాశయాదులను పైనుండియేజూచుచు, ఎతియోపియర్ జాతీయులు నివసించు పాలస్తీనాతీరమున నవలోకించుచు బయనము సాగించుచునే యుండెను. అర్గాన్ మున్నగు గిరిమధ్యప్రాంతములను దాటిన పిమ్మట నొక్కచో నొకనల్లరాతిక్రింద నమర్చబడియున్న యొకపెద్దతెల్లని విగ్రహము గానవచ్చెను. అచ్చటిప్రజ లారాధించువిగ్రహముల జూడవలయునని క్రిందికిదిగి సమీ పించిచూడగా నదియొక రక్తమాంసములతోనున్న శరీరము గల కన్యకయయ్యెను.

ఆమెచేతులు తలమీదుగా, నానల్లరాతికి త్తడిగొలు సులతో గట్టిగా గట్టబడియుండెను. విచారముతో నామెతలను వక్షముమీదికి వంచియుంచెను. అప్పుడప్పుడామె తలయెత్తి చూచుచు అమ్మా అమ్మాయని దల్లినిబిలచుచు దుఃఖించు చుండెను. చీకటిటోపీసధరించిన పర్నియసు మాత్రమామెను విశదముగా జూచుచుండెను. కనికరమాతనిచిత్తమునం బెన గొనెను. పర్నియసు ఆకన్యకసౌందర్యమునుజూచి యామె

యొక రాజకన్యకయనియు, నేదో యొక దోషమునలన నామె నట్టిబాధలు మోటుపరిజలు పెట్టుచున్నారనియు దలంచి, యామెనుమాటాడింప సమీపించెను. చీకటిని ళ్ళయినిదీసి యామెకగపడెను. ఆమెభయపడి కేకవేసెను. పర్సియస్ "సుందరాంగీ భయపడకుము. నేనాటవికుడనుగాను. హెలెన్ జాతీయుడను. నీకుదొలుదొల్త బంధవిముక్తిసేసెదను." యని పల్కి యామెచేతుల శృంఖలములను బెట్టికిపై వహూచెను. ఆకోమలాంగి "నన్ను ముట్టకుము. సముద్రదేవతలు నన్నిట్లు బంధించినారు. నన్నువిడిపించినచో వారు నీప్రాణములదీయుదురు." అనిబదులుపల్కెను. "అట్లేచంపనిమ్ము"న సర్సియసు తనదేవదత్తఖడ్గముతో నిత్తడిశృంఖలములను నఱికివైచెను. మఱియునతడు "ఇఁకనీవునాదానవు. వారెవ్వరైననుగానిమ్ము వారికినీపైన నధికారములేదనెను. "అమ్మా! అమ్మా! యని యామెపలుమార్లు కేకలువేసెను.

ఆదుఃఖమయారావమువిని పర్సియసు "నిన్నిట్లు ఘోరబాధకు విడిచినతల్లి, తల్లిగానేరదు. గూడువిడిచిన విహంగము పట్టుకొనినవానిదేయగును. పోగొట్టుకొనచేతఁ జిక్కించుకొను వానిదేయగును. పల్లాస్ఎథీను నేనుబడినశ్రమకు నాకుబహుమతి నిచ్చుటకై నన్నునీయొద్దికిరప్పించెను." అనివచించి, యామెను దనచేతులలోనికి దీసికొనెను. క్రూరులును ధర్మశూన్యులునునై యిట్టికోమలాంగిని బంధించిన సముద్రదేవతలెక్కడ ? ఇటసుందరాంగి ప్రాణముదీయచలఁచునని యత్నించిన వారెవ్వరు ?" అని యెలుగెత్తిపల్కెను. మఱియు, కన్యకామణీ ! నీవెవ్వరవు. నీకిట్టిదురవస్థ ఏలకల్గినది ? నీవృత్తాం

తెలియ చెప్పు”మని పర్సియసు వేడుకొనెను. అప్పుడాయువతీ మణి యిట్లు వాక్రుచ్చెను.

“అథియోపా దేశాధీశుడైన సిఫియస్ నాతండ్రి. నాతల్లిని క్యాసియోపియా యందురు. నన్నాండ్రోమెడాయని బిల్తురు. నాతల్లి యొకప్పుడు “మత్స్యముల రాణియగు, ఆటర్ గేటిస్ కంటె నాబిడ్డ ఆంద్రోమెడా అధిక సౌందర్యవతియని భాషించెను. ఈ వాక్యము పాపకారణమయ్యెను. ఆపాపమును బో నడంచుటకు నేనిచ్చట సముద్రపు దుష్టభూతమున కాహార మగుటకు, బంధింపబడినాను. అందువలన మత్స్యాధీశ్వరి మా దేశప్రజల కనేకవిపత్తుల గలిగించినది. అతడువచ్చి “యే పాపమెఱుగని నన్ను మ్రింగివేయగలడు.” ఆమాటవిని పర్సి యసు నవ్వి, “నేనింతకంటె నధికభయంకరములగు క్రూర మృగస్వరూపములను మట్టుపెట్టినానని వచించెను.

ఆ ధీరాలాపముతో నామెకు జీవితాశ యంకురించెను. గాని “నీవు యువకుడవు. నాకొఱకు నీవేల మరణించెదవు. నాకర్మను నేననుభవించెదను. నీవు నీత్రోవను బొమ్మని వాక్రుచ్చెను.

ప—అట్లుకాదు. ఆలింపస్ దేవతలు ఘనకార్యములను బ్రోత్సహింతురు. నేను వారినారాధింతును. వారి సహాయ ముచే నేను మెడుసా శీర్షమును నఱకినాను. అట్టి నాకీ సముద్ర రాక్షసుడొక లెక్కగాదు.”అని పర్సియసు ధైర్యము చెప్పెను. అంతలో సముద్రరాక్షసుడు దాపునకు రానుండు టంజూచి యామె కేకవైచి ఇఁక నాజీవితము ముగిసినది

నీవు తప్పుకొని పొమ్మని యార్చి యతడు పట్టుకొనిన తన చేయిని వదల్చుకొని యతనిని ద్రోసివైవ నుద్యమించెను. అయ్యెడనున పర్సియసు "సరియే నేను పోయెదను. ఒకవేళ నేనాక్రూరజంతువును జంపినచో" నిన్ను నేను వివాహమాడ గలనని వాగ్దానముచేసి, సమ్మతిసూచకముగా నొక ముద్దు పెట్టుమని యడిగెను. ఆకోమలి యప్పుడు తలయెత్తి యతనికి ముద్దొసంగెను. పర్సియసు సంతోషించి పైకెగిరెను. కన్య యాగండశిలయొద్ద వడకుచు నిలుచుండెను.

అనేకములగు మత్స్యములు తనవెంట నరుదేర' సముద్రరాక్షసుడు, జలమునుమియుచు, నామెనుసమీపించెను పర్సియసు అదనుజూచి యాకసమునుండి క్రిందికురికెను. సముద్రరాక్షసుడు, పర్సియస్ చూపిన మెడుసాశీర్షమునుజూచి యొక నల్లరాయియైవచ్చి యామెచెంతబడెను. అట్టితటి నామెనుదీసికొని పర్సియసు పైకెగిరి నిలువబడెను.

ఎతియోపియనులు తమశిలాస్థానములనుండి, రాజ కుమారియవస్థ యేమగునోయని చూచుచుండిరి. ఈవింత చర్యనుజూచి "కుమారి" రక్షింపబడినదని తెల్పుటకొక సందేశహారి తలిదండ్రులయొద్దకు బోయెను. సీఫియస్ క్యాసి యోపియాలు తత్ప్రదేశమునకువచ్చి తమకుమార్తె నానంద ముతో నందుకొనిరి. ప్రజలెల్లరు నమందానందనిమగ్నులై నృత్యసహితగాయనముల నాలపించిరి.

ఆసమయమున సీఫియస్ పర్సియసునుజూచి, హే లోక వీరాగ్రేసరా! నీవు నాకల్లుడవై నాయొద్దనేయుండుము,

నా రాజ్యమున నర్ధభాగమును నీకొసంగెదనని పల్కెను. పర్సి
యసు "నేను నీకల్లుడ నయ్యెదనుగాని నాకు నీరాజ్యమువలదు.
నేను నా.ఉపకారమున మార గ్రీసుదేశమున కేగి నాకొఱకెదురు
చూచుచున్న నాతల్లిని జూడవలయును. మాతయందును,
నిజదేశ మాతయందును, నాయభిలాష, నాయనురాగము,
భక్తి యెన్నటికిని సన్నగిల్లజాలదు." అని ప్రత్యుత్తర
మిచ్చెను. అప్పుడు సీఫియసు అండ్రొమెడాను పర్సియసుకిచ్చి
వివాహముసేయించి, యనంతరమున నల్లునితో "వీరపురుషా!
నాకుమార్తె పునర్జన్మమునెత్తినది. ఆమెను వెంటనే గొంపోవ
వలదు. ఒకసంవత్సరము మీరుభయులు మాయెదుటనుండి
పిమ్మట మీయిష్టానుసారముగఁ బోవచ్చునని సంభాషించెను.
పర్సియసు అందులకంగీకరించెను. కానియతడు రాజసౌధము
నెక్కకముందే, కట్టెలను రాళ్ళను దెప్పించి మూడువేదికలను
గట్టించి, ఎథీను, హెర్మీసు, జీయూస్ దేవతల ధ్యానించి యా
వేదికలపై వారికిహారమును సమర్పించెను. ప్రజలెల్లరు పర్సి
యసు వీరుడేగాక దైవభక్తుడునునని కీర్తించిరి.

అటుపిమ్మట వారందఱును రాజసౌధముకడకుబోయిరి.
ముఖభవనమున నడుగుపెట్టి చూచువఱకు, సీఫియసు సోదరు
డగు ఫైనియసు అతనికుమారులును సేవకులును మఱికొంద
అనుగాములును సాయుధులై నిల్చియుండిరి. ఫైనియసు
సీఫియసును సంబోధించి "నీకుమార్తెయగు నాండ్రొమె
డాను ఈపరదేశికిచ్చి వివాహము సేయ వీలులేదు. ఆమె
నాకుమారునకు బ్రధానము సేయబడినది. ఆమె యిప్పుడు-

సురక్షితముగానున్నది. నాసుతునకిప్పు డామెపై నధికారము లేదా ?" యని ప్రశ్నించెను. పర్సియసు హాస్యముసేసి యిట్లనెను.

"నీకుమారునకు వధువు గావలసియున్నచో, నొక కన్యకను మృత్యుప్రాయమైన విపత్తునుండి రక్షించి గైకొని రమ్మనిచెప్పుము. అదిగాక యీపెండ్లికుమారుడు పిన్నప్రియో జకుడై యీమెను మృత్యువునకు విడిచినాఁడు. అతనిదృష్టిలో నామె చనిపోయినది. ఆమెను నేను బ్రతికించినాను. నాకొఱ కామె బ్రతికినది. మఱియెవ్వరి కొఱకును నాయుసురువమును ధరించలేదు. కృతఘ్నుడా ! ఈసముద్రరాక్షసునిజంపి నేను నీ దేశమును, నీకుమారులను, నీప్రజలను నెల్లరను రక్షింప లేదా ? ఆరాక్షసుడు మీప్రాణములెల్ల దీసెడివాడుగాడా ? నీవు నాకు జేయవలసిన ప్రత్యుపకారమిదియా ? యూరకయూరకవ లికిబొమ్ము. కానిచో నీగతి దుర్గతియగును."

కాని సాయుధులైయున్న ఫైనియస్ పక్షమువారెల్ల రును పర్సియస్‌పై నుఱికిరి. తత్క్షణమే యతడు రాక్షసి తలను పైని చర్మముదీసి ఇదినావధువు నొక్కయపవిమృగము నుండి రక్షించెను. ఇప్పుడు పలువుర నుండి గక్షించగలదని పల్కెను. ప్రతి కక్షులెవ్వరును స్తంభీభూతులైరి. మఱిగొక సారి మెడూసా శీర్షముపై చర్మమును దొలగించువఱకు వారె ల్లరును శిలారూపముల నొందిరి.

పిమ్మట రాజసౌధమున వివాహమహోత్సవమును విందులును నేడుదినముల వఱకును జరిగెను. పర్సియసు దేవ

తల యాజ్ఞానుసారముగ దాను సాధించిన మహాకార్యము నకు బ్రతిఫలముగ నిట్టి సౌఖ్యమును వారొసగూర్చిరని అపరి మితానంద భరితుడయ్యెను. ఆంద్రోమెడా తన ప్రాణరక్షకుడే తనకు బ్రాణేశ్వరుడయ్యెనని అత్యంతహృదయ సంతృప్తియు, నపూర్వానందమును నొందెను.

ఎనిమిదవదినమున పర్సియసు కొక్క స్వప్నమయ్యెను. ఎథీను ఏడుసంవత్సరములకుబూర్వ మగపడిన రూపముతో నతని పక్కనిలిచి, యతనిని జేసనబిల్చి యిట్లనెను.

"పర్సియస్ వీరకుమారా! నీవు మానవుడు చూప దగిన పురుషకారము చూపినావు. అందులకు నీకిది బహు మానము. దేవతలు ధర్మతత్పరులనియు, తనకు తాను సహా యముచేసికొనఁ బాటుపడువానికి దేవతలు సాయపడుదురని యిప్పుడు తెలిసికొనుము. హేమశస్త్రమును, బంగారు పాద రక్షలను, చీకటి కుళ్ళాయిని నాకిచ్చివేయుము. నీస్వదేశమగు గ్రీసులో రాక్షస శీర్షముతో బనియుండును. గావున దానిని ముటికొంతకాలము నీయొద్దనేయుంచుకొనుము. ఆపదార్థము లెవ్వరివో వారికి వానిని నేను ముట్టజేయుదును. రాక్షసశీర్ష ముతో నీకు బనితీఱినతరువాత దానిని నీవు సెరిఫానులోని నాఆలయములోనుంచుము. నాకవచము నందు దానిని నే నెల్లప్పుడును ధరింతును. ఈభూమియందు ఎన్నడును జలోప ప్లవముగాని రాకుండునట్లు సముద్రమును నగ్నిని నేను శాంతి పఱచినాను. భూకంపములిందు రావు. ప్రజలు, జగత్పితయగు జీయుస్‌కును, నాకును ఆహారవేదికలు నిర్మింతురు గాక,

అమర్త్యులను, స్వర్గాధీశ్వరులను, సహృదయులైన భూమీశ్వరులను జనులు సంతోషముగ బూజించుచుందురుగాక."

ఎథీను ఆదేశముప్రకారము పర్సియసు ఖడ్గమును, పాదరక్షలను, గుళాయిని నిచ్చివేయుటకు లేచుచుండెను. అంతలో నతనికి మెలకువ వచ్చెను. స్వప్నము అదృశ్యమయ్యెను. అప్పుడు పర్సియసు శస్త్రాదులను వెదకికొనగాగాన రావయ్యెను. ఆచర్మమును రాక్షసశీర్షమును మాత్రమగపడెను. అందువలన నది దేవతాచర్యగాని స్వప్నమనుటకు నవకాశము లేదయ్యెను. పర్సియసు తిరిగి యీమూడు పదార్థముల నెన్నడును వీక్షింపలేదు.

పర్సియసు మఱునాడు ప్రజాసంఘములను సమావేశపఱచి, తనస్వప్నవృత్తాంతమునుజెప్పి, అమరపితయగు జీయస్‌కును, వీరులపాలిటి విజ్ఞానదాత్రియగు ఎథీనునకును బలివేదికలను నిర్మింపవలయుననియు, వరదలనుండియు, భూకంపములనుండియు భీతిచెందవలసిన పనిలేదనియు, సంతోషముతో క్షేత్రముల దున్ని విత్తులు చల్లవలయుననియు, గృహనిర్మాణములు సేయవలయుననియు నుద్బోధించెను. ప్రజలెల్ల రట్లొనరించి సర్వాభ్యుదయములను పొందిరి.

# వీరపురుషులు

## పర్సియసు

## ఐదవ భాగము

## పర్సియసు స్వదేశమునకువచ్చుట

ఒక్క సంవత్సరము గడచిన తరువాత, పర్సియసు, సమీపప్రాంతములనుండి నేర్పరులగు పనివాండ్రనుబిలిపించి, చందన భూరుహములను గొట్టించి, యొక సుందరమైన నౌకను నిర్మాణము చేయించెను. ఓడకు చక్కని రంగులు వేయించి ప్రక్క భాగములయందు తారు రాయించెను. అత్తమామల యనుజ్ఞదీసికొని ఆండ్రోమెడా ప్రయాణము సిద్ధపఱపించి యోడలో నెక్కించెను. ఆంద్రోమెడాకు బుట్టినింటి వారొసంగిన రత్నఖచిత స్వర్ణాభరణములను, అమూల్యాంబరములను, సుగంధ ద్రవ్యములను నోడలో భద్రము చేయించెను. పర్సియసు ఆండ్రోమెడాలు ప్రయాణోన్ముఖులైనప్పుడు సర్వప్రజలును, నామె తలిదండ్రులును ననంతముగా దుఃఖించిరి. నౌక కదలిపోయెను. పర్సియస్ చేసిన ఘనకార్యము శాశ్వతస్మరణీయమై యుండెను. అప్పటినుండి వేయి సంవత్సరములు కడచిన యింతవఱకును, పాలస్తీనాలోని అయోపావద్ద ఆంద్రోమెడా నల్లశిల పుణ్యస్థానముగా సందర్శింపబడుచుండెను.

పర్సియసు తన యనుచరులతో సెరీఫను బడమటి దెసగా నడపుకొనిపోయి, క్రీటుసముద్రమును దాటి, ఏజియన్ సముద్రముపై ప్రయాణముచేసి, హెల్లాస్ దీవుల ప్రక్కగా, బోవుచు, తన పూర్వస్థానమగు సెరీఫాసుకు జేరెను. ఓడను రేవున విడిచి యతడు తన తల్లి యొద్దకు ముందుగబోయి యామె పాదములకు నమస్కరించెను. మాతయు ప్రేమమీఱ గుమారుని గౌగిలించుకొనియెను.

అంతనతడు డిక్టిస్ యొద్దకుబోయి దండప్రణామము సేసెను. పెంచినప్రేమ తల్లి విరియ డిక్టిసు పర్సియసును గౌగి లించుకొని, చిరకాల వియోగానంతరమున గలిగినపునస్సమా వేశమున నానంద కందళిత హృదయారవిందుడయ్యెను.

అంతట నావీరపురుషుడు పాలిడెక్టిస్ భవనమునకు బోయెను. అత్తఱి నారాజు విందుబల్లమ్రోల నగ్రాసనమున గూర్చుండి యుండెను. అతని సామంతులును, భూస్వాము లును, తమతమ గౌరవముల ప్రకారము ఉచితాసనముల యందు గూర్చుండియుండిరి. వచనముచేయబడిన జలచర బళితముచేతను, అరణ్యమృగముల ఫలలముతోడను, నింప బడిన సువర్ణభాజనములు భోజనపీఠముపై నుంచబడియుం డెను, శోణిత శోణమైన మద్యముతో నింపబడిన కాచపాత్ర ములా పీఠమునలంకరించి యుండెను. గాయకులు గీతముల బాడుచుండిరి. త్రాగి మత్తులైనవారు తందనా లాడుచుండిరి. మద్యపాత్రము లొకరియొద్దనుండి మఱియొకరి కందించబడుచు టింగ్ టింగ్ మను నినాదముల జేయుచుండెను. కొందఱు గుర్లి జేసి మీసములను వ్యర్థముగా దువ్వుచుండిరి.

అట్టిసమయమున పర్సియసు భవనద్వారమువద్దనిల్చి పాలిడిక్టిసును, జేసున నెలుగెత్తిపిలిచెను. ఆభవనమునకు జేరిన యతిథులలో నెవ్వరును పర్సియసును గుర్తింపలేదు. ఏలయన దీర ప్రయాణమువలన నతనిశరీరము మార్పుచెందెను. సెరిఫోస్ ద్వీపమును విడిచినప్పుడు బాలుడుగానుండెను. ఇప్పుడతడు వీరపురుషుడయ్యెను. అతనికన్నులయం దసాధారణమైన తేజస్సు తాండవుజేసెను. అతనిగమనము మృగరాజుగమనము వలెనుండెను. అతనియునికి యొక అటవికవృషభముయొక్క రీతి ననుకరించియుండెను.

పాలిడిక్టిస్ పర్సియసుని గుర్తింపకపోలేదు. కానియతడు తనహృదయమును దోలుతటికంటె గఠినతరము జేసికొని యెను. "అధముడా! ఒకకార్యమును సాధించుటకంటె, సాధించుకొనివత్తునని వాగ్దానముచేయుట సులభమనుకొంటివా? నాకుదెచ్చెదనినన బహుమానమేమైనది?" యని ద్వీపాధిపతి పర్సియసును బ్రశ్నించెను.

"దైవసాహాయ్యము గలవారు తమవాగ్దానములను జెల్లించుకొందురు. దేవదూషణసేయువారు విత్తినప్రకారము గనే ఫలము ననుభవింతురు. మెడూసారాక్షసి శీర్షమును దెచ్చితిని. ఇదిగోచూడుము" అనిచెప్పుచు పర్సియసు, అజచర్మమును దొలగించి, రాక్షసశీర్షమును గనబడునట్లుగా బట్టుకొనెను. దానిభయంకరాస్యమును జూడగనే, ద్వీపాధిపతియొక్కయు, నతనియతిథులయొక్కయు ముఖములెల్లం గళాహీనములయ్యెను. వారెల్లరు తమపీఠములనుండి లేవనుద్యమించిరిగాని, యెవ్వరును గదలలేకపోయిరి. క్రమముగా వారి

కాయములు బిగిసికొనిపోయెను. నిమిషమాత్రమున మానవ శరీరములన్నియు శిలాస్వరూపములుగా మార్పుచెందెను.

పదంపడి పర్సియసు డిక్టిసును రాజ్యాధిపతిగాఁజేసి, తాను తనతల్లిని భార్యనుదీసికొని యోడనధిరోహించెను. నౌకారాజము ఆర్గాస్‌ద్వీపమునకు సూటిగాఁ బ్రయాణము సేసెను.

పాలిడిక్టీసును నతనియతిథులును కదలక మెదలక నట్లే కూర్చుండిరి. వారిచేతులలోని మద్యపాత్రములును నట్లే యుండెను. కాలాంతరమున భవనముగూలి వారిపై బడెను' భవనకుడ్యములు కూలెను. వారిపాదములకడ గడ్డిమొలిచి పెద్దదయ్యెను. రాజును నతనియతిథులును శిలలవలయముగ నేటికిని నాకొండపై గానవత్తురు.

పర్సియసు ఆర్గాసులోయలోఁ బ్రవేశించువఱకు, అతని మాతామహుడగు అక్రిసిసు కనఁబడడయ్యెను. అతని దుష్ట సోదరుడు, అతనిపై దాడిసేసి, ఆర్గాస్‌లోయ నాక్రమించు కొనుటచే, నతడు పిలాస్గీదేశమునందలి లారిస్సానకు బాఱి పోయెను.

అప్పుడు పర్సియసు ఆర్గోస్‌నివాసులఁ బ్రోవుసేసి, తన వృత్తాంతమును, శౌర్యసాహసములను దెలియఁజెప్పి, తిరిగి ఆర్గాసునాక్రమించెను. ప్రోటసును జంపివైచెను. సైక్లాప్ జాతీయులను దనసేవకులనుగా జేసికొనెను. వారిసహాయ్యము సార్గోస్‌లోయకొక దుర్గమునుగట్టించెను. తనతాతయగు అక్రీసియస్సును తిరిగి దీసికొనివచ్చి ఆర్గోసురాజ్యమునకుం బి

ఉభయసమ్మతితో రాజ్యాంగపాలనము చేయవలయునని సంకల్పించెను. పర్సియసు తనయనుచరులైన ఫోసిషియనులను వెంటబెట్టుకొని లారిస్సాకుబోయెను.

ఆయదనున లారిస్సాలో క్రీడాప్రదర్శనములు జరుగుచుండెను. ఒకయాటలో గెలిచి బహుమానమును బొందినచో తాతకు దనయందు సంతోషమును సౌహార్ధమును గలుగునని పర్సియసు భావించెను. అందువలన దుస్తులను దొలగించి, యాటగాండ్రలో నిలువఁబడెను. అతనియునికినిజూచి, తోడివారును, ప్రేక్షకులును నితడొక వీరపురుషుడని యనుమానించిరి. వారిలోనొకడు "ఈయువకుడైన పరదేశి ఎవరు? గర్వాతిశయమున నొక వృషభమువలె నిలువబడియున్నాడు" అనెను. ఆలింపసు నివాసులైనఅమరులగు వీరులలోనితడొకడు కావలెనని మఱియొకడు భాషించెను.

ఆటప్రారంభమైనప్పుడు అతనివైఖరిజూచి ప్రజలు అంతకంతకధికాశ్చర్యము నొందసాగిరి. పరుగెత్తుటయందును, కుస్తీపట్లు పట్టుటయందును ఈత కొట్టుటయందును పర్సియసు మొదటివాడుగా వచ్చెను. ఆనాలుగు పందెములయందును పర్సియసు విజయమునొంది నాలుగు బహుమతులను పొందెను. అంతనతడు తనలో "ఇంకనైదవ యాటలో విజయము నొందవలసి యున్నది. దానిలో సయితము విజయము నొంది బహుమతిని గ్రహించి, యాబహుమతుల నన్నింటిని నా తాతగారి పదములయొద్ద నుంచెదను." అని యాలోచించుకొనెను.

అతని తాతయగు అక్రిసియసు, లారిస్సాప్రాంతాధీశుడై నట్యూటామినీసు ప్రక్కగూర్చుండెను. ట్యూటామినీసు వయసున పెద్దవాడు, నెరసిన గడ్డముగలవాడు. రాజ్యచిహ్నమగు దండమును హస్తమున ధరించి యుండెను. పర్సియసు తాతను జూచినప్పుడు అతనిమనస్సు వ్యాకులమానందముగన్నీరుగార్చెను.

అటుపిమ్మట పర్సియసు ఒక యినుపగుండును నందఱికంటె నెనిమిది గజముల యధికదూరమునకు విసరి, విజయమును బడసెను. ఆసమయమున ప్రేక్షకులు "ధైర్యశాలీ! యింకను దూరమునకువిసరగలవు. విసరుము." అని ప్రోత్సాహకరములైన వాక్యములాడిరి. ఈప్రదేశమున నింత దూరమునకు గుండు విసరినవారు ఇంతవఱకు గనబడలేదని కొందఱు భాషించిరి. ఆప్రసంగములచే పర్సియసు అత్యంతము ప్రోత్సాహితుడై, తన బలమునంతయు వినియోగించి మఱియొకమాఱా యినుప గుండును విసరెను. ఆసమయమున సముద్రమునుండి విపరీతమైన యొక్కవాయువువచ్చి యాగుండుయొక్క మార్గమును దిప్పివైచెను. అప్పుడది గిరగిర దిరుగుచు, నందఱువిసరుపాటు దూరములకంటె నధికమైన దూరమునకు బోయి, ఆముందు కూర్చుండిన అక్రిసియసు పాదమున దవిలి గాయపఱచెను. అక్రిసియసు వెంటనేమూర్ఛనొందెను.

పర్సియసు తాతయొద్దికిబోయి యుపచారము సేయనుద్దేశించెను. కాని ప్రక్కనున్న వారతనిని లేవదీసి కూర్చుండబెట్టగా నతడు విగతజీవుడై యుండెను. అక్రిసియసు మిక్కిలి దుర్బలుడగుటచే నొక చిన్నదెబ్బనే భరింపజాలక మూర్ఛ

పోవునని కొందఱు ప్రసంగించిరి. ఆయుఃప్రమాణము తీఱిన తరువాత నేదో యొక చిన్న నిమిత్తముచేతనే మానవుడు జీవముల గోల్పోవుట సహజమని మఱికొందఱాడిరి. పర్సియసు తనమాతామహుని మరణమున కత్యంత సంతాపమునొందెను. నెత్తిని గొట్టుకొనుచు చాలసేపు శవముపై బడియేడ్చెను. పిదప నతడు లేచినిలుచుండి, ప్రజలనుసంబోధించి, "దేవతలవాక్యములు సత్యములు. వారు విధించినవిధానము జరుగక మానదు. నేను ఈమనుష్యుని మనుమడను. నన్ను పర్సియసందురు. మెడూసాశిరస్సును జెక్కాడిన వాడను. చాలదినములక్రిందట నొక మహర్షియుడు నేను నాతాతను జంపుదునని జోస్యము జెప్పెను. నాకట్టి యభిప్రాయము లేకున్నను, దేవతల ఆదేశాను సారముగ నతడు నాచేతఁ జంపబడినాఁడు." అని వెక్కివెక్కిలి రోదనము సేసెను.

అక్రీసియసుకొఱకు చితియేర్పఱచబడెను. ధర్మానుకూలముగ నతనికాయమునకు దహనసంస్కారము సేయబడెను. ఆపిమ్మట పర్సియసు దేవాలయమునకుబోయి, అవిజ్ఞాతముగాజేసిన హత్యవలన దనకుగలిగినపాపమును దొలగించు సంస్కారమునొంది పరిశుద్ధుడయ్యెను.

పిమ్మట నతడు ఆర్గోస్‌లోయకుబోయి ఆండ్రోమీడాతో రాజ్యసింహాసనమునఁ బట్టాభిషిక్తుడయ్యెను. కాలక్రమమున నతనికి నలుగురుకుమారులును ముగ్గురు కుమార్తెలును గలిగిరి. పర్సియసు సర్వసంపత్సమేతుడై ప్రజానురంజకముగ రాజ్యపరిపాలనముచేసి, వార్ధక్యమునందు భగవద్భక్తి

పూరితహృదయముతో భగవన్నామసంకీర్తనము సేయుచు, జీవములనువదలి వీరస్వర్గము నలంకరించెను.

పర్సియస్ దంపతుల మరణసమయమునందు, ఎథీను స్వయముగావచ్చి వారిసూక్ష్మశరీరములను రెక్కలుగల సువర్ణవిమానమున గూర్చుండబెట్టి స్వర్గలోకమునకు గొంపోయెను.

సీఫియస్సును కాసిమోపియాకును, స్వర్గసీమయందు స్థానములభించినది. వారందఱును స్వర్గమునఁ దేజోమయస్వరూపములతోఁ బ్రకాశించుచుందురు. పర్సియసు మణిమయకిరీటముగల శీర్షముతోడను, నొకప్రక్క నతనిచే నార్జింపబడిన రాక్షసిశీర్షముతోడను, బ్రకాశించుచుండును. ఆండ్రోమెడా అతనిప్రక్క సారింపబడినచేతులతో, సముద్రరాక్షసునకెఱయగుటకు సిద్ధపడియున్నపరిస్థితిలో నిర్బాధకముగానిలిచి, యున్నట్లు తేజోరూపమునఁ బ్రకాశించుచుండును. పగటివేళ వారందఱు ఆలింపస్ పర్వతముపై యమరులతోఁగూడి విందులారగించుచుందురు.

సాహసకార్యములనుసాధించు వీరపురుషుల కుభయలోకములయందును, శాశ్వతయశస్సౌఖ్యములు ప్రాపించునని పర్సియసువృత్తాంతము సర్వజగంబులకును నీతిఁగఱపుచున్నది.

---